# వీరభారతి

## ఉపవాచకము

4, 5, 6 ఫారములకు


“ఉభయ భాషాప్రవీణ”

జంధ్యాల పాపయ్యశాస్త్రి



ప్రకాశకులు

ఎ. ఎల్. రెడ్డి అండ్ కో.,

బుచ్చిరెడ్డిపాలెం

(నెల్లూరు జిల్లా)

# నీరాజనము

వీరుల జీవనములు జాతికి సంజీవనములు! వీరుల విహారములు జాతి కలంకారములు! వీరుల బలిదానములు జాతికి వరప్రదానములు!

భారతభూమి వీరభూమి! భారతమాత వీరమాత! భారతగాథ వీరగాథ! భారతము వీరభారతము!

భారతజాతికి వీరపూజ ఉగ్గుబాలతో బోసినది. భారతీయులకు వీరారాధనము వెన్నతో బెట్టినది.

భారతము పరతంత్రమై పోయినది. భారతీయులు నిర్వీర్యులైనారు. వీరపూజ విస్మృతమైనది. వీరారాధనము విచ్ఛిన్నమైనది. జాతి నీరసించి పోయినది. జాతీయత మహాపాపముగ పరిణమించినది.

ప్రభాతమైనది. పారతంత్ర్యతమస్సులు పటాపంచలైనవి. స్వాతంత్ర్యసూర్యోదయమైనది. భారతమాత హృదయపద్మము ప్రఫుల్లమైనది.

"వీరభారతి" యావిర్భవించినది. వీరవిపంచి నందుకొన్నది. వీరగీతుల నాలపించుచున్నది. విద్యార్థిహృదయములకు వీర నీరాజనము లెత్తుచున్నది.

భావిభారతపౌరుఁడ వగు విద్యార్థీ! విజయీభవ!

రచయిత.

రండు." ఇట్లు చాటించుచు వా రా సింహమును పాటలీపుత్ర కోటవాకిలియొద్దకుఁ గొనివచ్చిరి.

అది సభామంటపము. నందమహారాజు కొలువుదీర్చి యుండెను. మంత్రులు, సామంతులు తమతమ యాసనములపై నుపవిష్టులై యుండిరి. వందిమాగధుల కైవారములు మిన్ను ముట్టుచుండెను. ఇంతలో ద్వారపాలకుఁడు చనుదెంచి "మహాప్రభూ! కొందఱు క్రొత్తపురుషు లొక చిత్రమైన సింహమును గొనివచ్చి దేవరవారి యనుజ్ఞకై సింహద్వార మున వేచియున్నా" రని విన్నవించెను.

నందమహారాజు వారిని గొనిరమ్మని యనుజ్ఞ నొసఁగెను. కొలఁదిసేపటికి నూతనపురుషులు సింహముతో రాజ సభలోనికిఁ బ్రవేశించిరి.

మహారాజు:-ఓరీ! మీ దే దేశము? మీ రాజెవరు?

పురుషులు:-ప్రభూ! మాది సింహళదేశము. మగధ సామ్రాజ్యమున మంచిమంచి బుద్ధిమంతులు గలరని విని మా ప్రభువుగారీ సింహమును మీ యాస్థానమునకుఁ బంపిరి.

మహారాజు:-ఎందులకు?

పురుషులు:-పరీక్షార్థము ప్రభూ!

మహారాజు:-ఏమీ సింహళరాజు మమ్ము పరీక్షింప నెంచెనా? మంచిది. ఇందలి విశేష మేమిటో వివరింపుఁడు.

పురుషులు:-ఈబోను తలుపులు తెఱవకుండ చువ్వలు కదల్పకుండ లోపలిసింహమును వెలువరింపవలయును.

ఆ మాటలు వినుటతోడనే రాజు విస్మితుఁడయ్యెను. సభ్యులంద ఱాశ్చర్యముతో నా వింత సింహమువైపు వీక్షణములు సారించిరి. బోనులోనున్న హర్యక్షము నోరుదెఱచి నాలుకచాచి మిక్కిలి భీతిగొల్పుచుండెను. ఉండియుండి యిటునటు తిరుగుచుండెను. కేసరములను విదలించుచు వాలమును గదలించుచుండెను. ముందువెనుకల కూగుచు కనుగ్రుడ్లు త్రిప్పుచు చెవులు నిక్కించుచుండెను.

ఎవ్వరి కేమియుఁ దోఁచలేదు. ఆ కఠినసమస్య నెట్లు విప్పవలెనో తెలియలేదు. తలుపులు తెఱవకుండ సింహమును తరలించుటెట్లు? అంతయు నగమ్యగోచరముగ నుండెను. ఈ వార్త పట్టణము నలుమూలలఁ బ్రాకెను. పాటలీపుత్ర పౌరు లాబాలగోపాల మా యద్భుతదృశ్య మాలోకించుటకై కొలువుకూటమున గుమిగూడిరి. కాని యేమి చేయవలెనో యెవ్వరికిని స్ఫురింపలేదు. కన్నులుపెట్టుకొని కనుఁగొనువారేగాని కర్తవ్యము గుర్తించిన వారొక్కరును లేక పోయిరి.

ఇంతలో పదేండ్ల బాలకుఁ డొకఁడు పరుగుపరుగున నచ్చటికరుదెంచి యా విచిత్రమును విలోకించి "ఓహో! దీనికేనా యింతదూరము వచ్చితిరి? రాజాజ్ఞయైనచో బోను నుండి సింహమును దరలించు టెంతపని?" అని సగర్వముగఁ బలికెను. నందమహారాజు యర్భకుని జూచి "నీ వీ పని చేయగలవా?" అని ప్రశ్నించెను. "దేవర వా రాజ్ఞ యిత్తురా?" యని బాలుఁడు పలికెను. "మంచిది! కానిమ్ము." అని మహా

రాజు మొదల యిడెను. సభ్యు లందఱు తమతమ స్థానముల లోనికిఁ బోయికూర్చుండి యీ వినోదమును వీక్షించుచుండిరి. మహారాజు విస్మయవిస్ఫారిత నయనములతో నేమి జరుగునో యని తెప్పవెట్టక చూచుచుండెను.

బాలుఁడు తదేకదృష్టితో హర్యక్షము నవలోకించెను. కొంచె మాలోచించి తలపంకించి మందహాసము చేసెను. "ఎఱ్ఱగాఁ గాల్చిన యినుపకడ్డీలు రెండు తెప్పింపుఁ" డని పలికెను. రాజభటులు గణగణ కాలుచున్న కడ్డీలను గొని వచ్చిరి. బాలుఁడు వాని నందుకొని చువ్వలసందుగా బోను లోనికిఁ బోనిచ్చి తెఱచియున్న సింహము నోటిలోఁ జొనిపెను.

వెంటనే సింహము కరగి నీరై పోయెను. "లక్క-సింహము! లక్క-సింహ" మను కేకలు సభలో నొక్కమాటుగ పిక్కటిల్లెను. బాలుని బుద్ధికౌశల్యమునకు "మేలుమే" లని సభ్యులందఱు చప్పట్లు చఱచిరి. మహారాజు బాలుని ముఖ మాలోకించి "నేఁటికి నీమూలమున మా మగధరాజ్యగౌర వము దక్కినది. మా మర్యాదఁ గాపాడితివి. నీ వెవఁడవు? నీ తలిదండ్రు లెవరు?" అని సబహుమానముగఁ బ్రశ్నించెను.

"నా పేరు చంద్రగుప్తుఁడు. నా తల్లిపేరు మురి. తండ్రి యెవ్వరో తెలియదు." అని ప్రభువాక్యములకు బాలుఁడు బదులు పలికెను.

ఆ మాట వినుటతోడనే నందుని కనుబొమలు ముడి వడెను. మొగ మెఱ్ఱవారెను. "భటులారా! ఈ బాలుని

బంధించి కారాగారమునఁ బడవేయుఁడు." అని కఠినముగ నాజ్ఞాపించెను. సభ్యులెల్లరు చకితులైరి.

౨

అది నందరాజు విలాసోద్యానము. నటీమణులు నాట్యము చేయుచుండిరి. గాయకులు గానము చేయుచుండిరి. ఒక పుష్ప నికుంజము మధ్యనున్న స్ఫటిక శిలావేదికపై నందుఁ డాసీనుఁడై యుండెను. అతఁడు బాగుగాఁ ద్రాగి మైమఱచి యుండెను. ఒకదానివెంట నొకటి మద్యపాత్రములు చెల్లి పోవుచుండెను. చేతికి నోటికి నెడతెఱపి లేకపోయెను. సంగీత వాద్యముల ధ్వని తరంగములలో నటీమణుల నాట్యభంగి మలలో రాజు హృదయము తేలిపోవుచుండెను. తప్పత్రాగి యొడలు తెలియక యిష్టము వచ్చినట్లు వదరుచున్న రాజ బంధువుల స్తోత్రపాఠములు వనమంతయుఁ బ్రతిధ్వనించు చుండెను.

ఇంతలో నొక సేవకుఁ డరుదెంచి "మహారాజా! పాటలీ పుత్రపౌరులు కొందఱు తమ కష్టములు దేవరవారితో మనవి చేసికొనుటకై వచ్చియున్నా"రని పలికెను. నందరాజు కోప ముతో "ఓరీ! ఇట్టి సంతోషసమయమున నట్టి సంతాప విషయ ములు వినము. పోపొ" మ్మని గద్దించెను.

మఱియొక రాజభటుఁ డరుదెంచెను. మహారా జేల వచ్చితివని ప్రశ్నింపఁగా వాఁడు "ప్రభూ! మహామంత్రి రాక్ష సులవారు మి మ్మొకమాటు దర్శింపఁ గోరుచున్నా"రని

మనవి చేసెను. "ఇది సమయము కాదు. మఱియొకమాఱు కలిసికొమ్మని చెప్పు"మని రా జాజ్ఞాపించెను.

అంతలో కారాగారాధికారి వచ్చి "మహారాజా! చంద్రగుప్తుఁడు కారాగృహమునుండి తప్పించుకొని పారి పోయినాఁ"డని వచించెను. మహారాజు మైకములో "చంద్ర గుప్తుఁడు పోయినాఁడా! పోనిమ్ము. మన కేమి నష్టము? మంచి పని చేసినాఁడు." అనెను.

అట్టి సమయమున నొక బ్రాహ్మణుఁ డచ్చటికి విచ్చే సెను. వాని దేహము శుష్కించియుండెను. విశాలమైన ఫాలభాగమున బ్రహ్మతేజ ముట్టిపడుచుండెను. కన్నులు కాంతిమంతములై ప్రజ్ఞావైభవమును బ్రకటించుచుండెను. అతఁడు ద్వారరక్షకులను ద్రోసిపుచ్చి లోనికిఁ జనుదెంచి నందునిముందు నిర్భయముగ నిలుచుండెను.

అట్లు నిర్లక్ష్యముగ నిలబడియున్న బ్రాహ్మణుని జూచి నందుఁ డాగ్రహావేశముతో "ఎవరు నీవు? ఇక్కడి కేల వచ్చి తివి?" అని ప్రశ్నించెను.

"నేను బ్రాహ్మణుఁడను. నా పేరు చాణక్యుఁడు."

"బ్రాహ్మణుల కిక్క డేమి పని? శ్రాద్ధములు సంత ర్పణములు జరుగుచోటు కాదే యిది!"

"న్యాయమునకై వచ్చితిని. నేను మగధదేశ పౌరుఁ డను. పాటలీపుత్రము నా నివాసస్థానము. పన్నెండు సంవత్సర ములకు పూర్వము విద్యాభ్యాసమునకై "తక్షశిల విద్యా లయము"న కేగితిని. అచ్చటి విశ్వవిద్యాలయములో సమస్త

శాస్త్రములు చదివి సంపూర్ణ విద్యావంతుఁడ నైతిని. అనంతరము పాటలీపుత్రమునకుఁ దిరిగివచ్చి చూతును గదా నా యాస్తి యపహరింపఁబడినది. క్షేత్రములు లన్యాక్రాంతము లైనవి. గృహము పరాధీన మైనది. నా ముసలితండ్రి బలవంతముగఁ జంపఁబడినాఁడు. ఇదంతయు నేమని యడుగ "నందమహారాజుల పరిపాలనా ప్రభావమని యచ్చటివారు వచించిరి."

"ఏమీ! నా పరిపాలనమునే నిందించుచుంటివా?"

"నే నొక్కఁడను నిందించుట యేమి? జను లాబాలగోపాలము వేనోళ్ళఁ దిట్టుచున్నారు. నందరాజ్య మెప్పుడు నాశన మగునా యని వెయ్యిదేవతలకు మ్రొక్కుచున్నారు."

"ఓయీ! ఒడలు తెలిసి మాటాడుము."

"నేను దేహము తెలిసియే యుంటిని. మద్యపానముచే మత్తెక్కి మాటాడుట లేదు."

"అనవసరముగ మా యానందమున కంతరాయము గలిగించిన నీ యపరాధము నిఁక క్షమింపము. నీ వింత యుద్ధతుఁడవు గనుకనే నీకట్టి ప్రాయశ్చిత్త మైనది. ఇక పో! నెత్తిన గుడ్డ వేసికొనిపో!"

"నీబోటి నీచులు, స్వార్థపరులు రాజులై రాజ్యము వెలిగించుచున్నప్పుడు మా బోటి ప్రజల కట్టిగతి పట్టుటలో నాశ్చర్య మేమున్నది? ఇదేనా రాజధర్మము? ఇంతేనా నీ న్యాయపరిపాలన? దొంగతనము, దోపిడి, దురాక్రమణ, విలాసవిహారములు, మద్యపానములు, మైకపుమాటలు ఇవేనా నేఁటి మగధదేశమహారాజుల మర్యాదలు!!"

చాణక్యునిమాటలు విని నందునకాగ్రహముచే నా పాదమస్తకము కంపించెను. అతఁడు పటపట పండ్లు గొఱకుచు “ఓరీ! సేవకులారా! చూతు రేమి! ఈ బడుగు బాపని బయటకు గెంటివేయుఁ” డని పలికెను. వెంటనే రాజభటులా విప్రుని చుట్టుముట్టి జుట్టుపట్టుకొని లాగిరి. చాణక్యుఁడు ప్రళయకాలరుద్రుఁడయ్యెను. అతని నయనములనుండి యగ్నికణములు జలజలరాలెను. అతని హృదయములో నగ్నిపర్వతము బ్రద్దలయ్యెను. “ఓరీ! నందాధమా! ఎంత ఘోరకృత్యమునకు బాల్పడితివి? ప్రజాద్రోహీ! దుర్మదాంధా! ఇదిగో నా ప్రతిజ్ఞ వినుము! నిన్ను, నీ సింహాసనమును, నీ ప్రభుత్వమును, నీ వంశమును, నీ సర్వస్వమును నాశనముచేసి తీరెదను. అంతవఱకు వీడిన యీ శిఖను బంధింపను.” అని వాక్రుచ్చి యచ్చోటు విడిచి చాణుక్యుఁడు చకచక వెడలిపోయెను. పరాభవానల దందహ్యమానమానసుఁడగు బ్రాహ్మణుని నోటినుండి వెలువడిన కఠోరశాపము కుఠారాఘాతము వలె నందుని గుండెలకుఁ దగిలెను. మద్యపానమహాపిశాచి నిండు కౌగిలిలో జరిగిన సంఘటన మంతయు నాతనికి స్వప్నమువలె గోచరించెను.

## 3

సాయంకాలము కావచ్చుచుండెను. పాటలీపుత్ర పట్టణ ప్రాంతమందలి యొక యరణ్యములో చాణక్యుఁడు నడచి పోవుచుండెను. ఆలోచనామగ్నుఁడై యట్లరుగుచున్న యాయన పాదమున నొక దర్భప్రోడు గ్రుచ్చుకొనెను. వెంటనే

చాణక్యుఁడు "ఏమీ! కుశమూలములకు నైతమింతగర్వమా?" యని యాగ్రహోద్రేకమున మొదలంటఁ బెకలించి ముక్కలు ముక్కలుగాఁ జేసి పొడిపొడిగా నలిపి గాలిలో నెగుర వేసెను.

అది యంతయు దూరమునుండి యవలోకించుచున్న యొక యువకుఁడు చరచర నరుదెంచి చాణక్యుని చరణ యుగమునకు సాష్టాంగనమస్కార మాచరించెను. చాణక్యుఁడు నివ్వెఱపడి "వత్సా! నీ వెవ్వర" వని యువకుని బ్రశ్నించెను. యువకుడు "స్వామీ! నేను చంద్రగుప్తుఁడను వాఁడను. మగధరాజ కుటుంబములోని వాఁడను. మీ విచిత్ర ప్రవృత్తి విస్మయము గొల్పినది. ఆ కుశమూలము నట్లు తూర్పారబట్టితి రేమి?" అని సవినయముగఁ బల్కెను.

"వత్సా! చంద్రగుప్తా! ఈ కుశము నా కాలిలో గ్రుచ్చుకొనినది. శత్రుశేష ముండరాదని భావించి దీనిని సమూలముగాఁ బెకలించివైచితిని. ఇది నందవంశనాశన మను నాటకమునకు నాందీసూచన. తెలిసినదా?"

"ఆచార్యా! నేటినుండి మీరే నా గురుదేవులు. ఈ చంద్రగుప్తుఁడు మీ శిష్యుఁడు.

"ఏమీ నీవును దుర్మార్గుఁడగు నందుని దుండగములకు లోనైతివా?"

"గురుదేవా! మహాపద్మనందుని యనంతరము పెద్ద వాఁడగు మా తండ్రి మగధదేశమునకు మహారాజు కావలసి

యుండగా రెండవ భార్య బిడ్డలగు నందులు కుట్రఁజేసి మా తండ్రిని, నా సోదరులను కారాగారములో బంధించిరి. నా వారందఱు తిండి నీళ్ళు లేక చీకటికొట్టులో కృశించి కృశించి నశించిపోయిరి. పసిబిడ్డ నని జాలిదలచి నన్ను మాత్రము మా తల్లితో వదలిపెట్టిరి. అనంతర మొకనాఁడు రాజసభలోని కరిగితిని. అట నా బుద్ధిచాకచక్యమున కసూయపడి నన్ను సైతము కారాగృహాబద్ధుని గావించిరి. పదిసంవత్సరములా పాతాళగృహములో భరింపరాని బాధలుపడి చిట్టచివరకెట్లో కారాగృహారక్షకుల కన్నుగప్పి తప్పించుకొని బయటఁబడి దిక్కుచెడి దేశభ్రష్టుడనై యిట్లు తిరుగుచుంటిని."

"కుమారా! నీచాత్ములగు నందులు నిన్నే కాదు; నన్ను సైతము పరాభవించిరి. నందసామ్రాజ్యము నాశనమగుట నిక్కవము, అనంతరము మగధసింహాసనమునకు ప్రభువు చంద్రగుప్తుఁడు."

"గురుదేవా! మీరు సత్యసంకల్పులు! మీ యనుగ్రహ మున్న నసాధ్య మేముండును?"

అనంతరము కొంతసేపు గురుశిష్యు లిరువురు ప్రాంతముననున్న వటవృక్షముక్రిందఁ గూర్చుండి మంత్రాలోచనము సలిపిరి. మగధరాజ్యమునకు శత్రు లెవరో మిత్రు లెవరో చంద్రగుప్తుఁడు చాణక్యునకు స్పష్టీకరించెను. మహామంత్రియగు రాక్షసుని యద్వితీయ మేధాశక్తిని, అనుపమానపరాక్రమమును వర్ణించెను. తన తండ్రికి మిత్రులై నేఁటికిని తన్నభి

మానించుచున్న భాగురాయణాది సేనానాయకుల మనస్తత్వము లెఱింగించెను. మగధసామ్రాజ్యమునకు ప్రక్కలోని బల్లెమువలె నున్న పర్వతరాజు శక్తిసామర్థ్యములను విశదీకరించెను. ఇట్లు చాణక్యుఁడు చంద్రగుప్తునిచే పాటలీపుత్రము గుట్టుమట్టులన్నియుఁ దెలిసికొనెను. అనంతరము భావికర్తవ్య నిర్వహణమునకుఁ గడంగెను.

చంద్రగుప్తుఁడు పర్వతప్రాంతనివాసు లగు నాటవికుల నెల్ల సంఘటితపఱచి వారికి సక్రమమగు సైనికశిక్షణ మొసగి యుద్ధసన్నద్ధులను గావింప నిశ్చయించెను. చాణక్యుఁడు మాఱువేషములతో మగధరాజ్యమందు సంచరించుచున్న తన శిష్యులచే నెప్పటికప్పుడు రహస్యములఁ దెలిసికొనుచుండెను. భాగురాయణాది సేనాపతులను దన బుద్ధి నైపుణ్యముచే స్వీయపక్షమునకుఁ ద్రిప్పుకొనెను. పర్వతరాజున కర్ధరాజ్యమిత్తునని యాశపెట్టి మగధపై దండయాత్రలోఁ దమకు సాయపడుటకుఁ బ్రయత్నములు సల్పెను. చంద్రగుప్తుని శౌర్యాగ్నికిఁ జాణక్యుని మంత్రాలోచనము మహామారుత మయ్యెను. ప్రచండమగు నా దావానలములో నందవంశము భస్మీపటలము గాకపోవునా? మగధసింహాసనమును చంద్రగుప్తుఁ డధిష్ఠింపకపోవునా?

౪

అవి సింధునదీ పరిసరములందలి గ్రీకుల యుద్ధశిబిరములు. యవనదేశాధీశ్వరుఁడగు నలెగ్జాండరు విశ్వవిజేత

కావలయు నను కుతూహలముతో భారతభూమిపై దండెత్తి వచ్చియుండెను.

ఆ నాఁడు గ్రీకుసేనాధిపతి యగు సెల్యూకసు ఆయన కుమార్తె హెలీనా వాహ్యాళికై బయలుదేరినారు. సింధు నదియొడ్డుననే వా రా యరణ్యప్రాంతములోఁ గొంతదూరము నడచిపోయి యందలి ప్రకృతిసౌందర్యమునకుఁ దన్మయము లైన హృదయములతో మరలి గుడారములకు వచ్చుచుండిరి.

"నాయనా! భారతభూమి పవిత్రమైన దని విన్నాను. మన సార్వభౌముఁడు భారతదేశముపై దండెత్తివచ్చుట దురాక్రమణ మనిపించుకొనదా? ఒకదేశము మఱియొక దేశముపైఁబడి దోచుకొనుట న్యాయవిరుద్ధము కాదా!"

"అమ్మా! అట్లు కాదు. సామ్రాజ్యము విస్తరింపఁజేసి కొనుటకొఱకు సలుపు సంగ్రామములు ధర్మవిరుద్ధములు కావు. చక్రవర్తులకు జైత్రయాత్రలు స్వభావసిద్ధము లగు ధర్మములు."

"తండ్రీ! సామ్రాజ్యవిస్తరణమునకై సమరము చేయుటయా! ఆహా! అమాయికజనుల హాహాకారములే సార్వభౌములకు జయజయనినాదములు కాఁబోలు! మన చక్రవర్తి యింకను జైత్రయాత్ర సాగించునా?"

"తక్షశిలాధీశ్వరుఁడు, 'అంభి' మొదలగువారు మనకు లోఁబడిపోయిరి. మన చక్రవర్తికి మగధదేశము జయింపవలె నను కాంక్షకలిగినది గాని సైనికులు స్వదేశమునకు మరలి

పోవలెనని పట్టుదలవహించుటచేతను, మన దేశములో సామంతులు విప్లవము లేవదీయుచున్నారను వార్తలు వచ్చుట చేతను సార్వభౌముని జైత్రయాత్ర మందగించినది."

ఇంకను సెల్యూకసు మాటలు పూర్తికాలేదు. బాట ప్రక్కనున్న గుట్టలోనుండి యొక భయంకర శార్దూలము ముందు నడచుచున్న సెల్యూకసుపై దుమికినది. సెల్యూకసు తన చేతనున్న కత్తిని దానిపై విసరినాఁడు. కాని బెబ్బులి దెబ్బ తప్పించుకొని ద్విగుణీకృతవేగముతో హెలీనాపైఁ బడఁ బోయినది. హెలీనా "తండ్రీ, తండ్రీ!" యని యఱచుచు నటునిటు బరువిడినది. ఇంతలో నెటనుండియో యొక బాణము రివ్వున వచ్చి పెద్దపులి చెవిదాఁక లో గ్రుచ్చుకొనినది. ఆ శరాఘాతముచే శార్దూలము గిరగిర తిరిగి ధరణిపైఁ బడినది.

హెలీనా సెల్యూకసులు కొంచెము తెప్పరిల్లి లేచి చూచునప్పటికి వారి ముందొక వీరకుమారుఁడు నిలిచి యుండెను. ఆ శూరాగ్రేసరుం డొకచేత ధనుస్సును మఱి యొక చేత బాణములను ధరించియుండెను. దీర్ఘమగు కర వాలము నడుమున వ్రేలాడుచుండెను. మెలికలు తిరిగిన మేని కండలు పరాక్రమమును బ్రదర్శించుచుండెను. నూనూగు మీసముల నూత్న యౌవనముతో మెఱసిపోవుచున్న యా భారతవీరకుమారుని సందర్శించినంతనే హెలీనా ముఖపద్మము వికసించెను. కపోలములు లజ్జారుణితము లయ్యెను. కలువ రేకుల వంటి కన్నులు మఱింత విశాలము లయ్యెను. ప్రథమ

సందర్శనమందే యువతీయువకుల హృదయక్షేత్రములలో ననురాగబీజము లంకురిత మయ్యెను.

సెల్యూకసు సగౌరవముగ యువకునకు స్వాగత మొసఁగి తన కృతజ్ఞత ప్రదర్శించెను. హెలీనా అరటిమువ్వల వంటి తన చేతు లెత్తి ధన్యవాదము లర్పించెను.

"మిత్రుఁడా! నేఁడు నీవు మాకు ప్రాణదాన మొన రించితివి. నీ ఋణము తీర్చుకొనఁజాలము. రమ్ము! మా చక్రవర్తి కడకుఁ బోవుద" మని సెల్యూకసు యువకుని చేయి పట్టుకొని యలెగ్జాండరు సముఖమునకుఁ గొనిపోయెను.

అలెగ్జాండరు సార్వభౌముఁ డా వీరకిశోరమును కన్ను లార దర్శించినాఁడు. అతని ధీరగంభీరస్వరూపమున కచ్చెరు వందినాఁడు. తన సేనానాయకునిచే వాని పరాక్రమమును బాణప్రయోగనైపుణ్యమును తెలిసికొనినాఁడు.

"యువకుఁడా! నీ పేరేమి? నీ చరిత్ర మెట్టిది? నీ వీ ప్రాంతమున నేల సంచరించుచుంటివి?"

"యవనేశ్వరా! నా పేరు చంద్రగుప్తుఁడు. నే నొక నిర్వాసితరాజకుమారుఁడను. న్యాయముగ నాకు రావలసిన మగధసింహాసనమును నందరాజు లాక్రమించినారు. నన్ను దేశమునుండి వెడలనడచినారు. నేను మఱల మగధ నాక్ర మించుకొనుటకై యాటవికసైన్యము నాయత్తపఱచుచు నజ్ఞాతవాసము చేయుచున్నాను. మీ యుద్ధపద్ధతులు, వ్యూహ రచనలు, సైన్యవిన్యాసములు నన్నాకర్షించినవి. అందుచే

నీ ప్రాంతమునఁ జరించుచు మీ యుద్ధ విద్యావిశేషములు గ్రహించుచున్నాను."

"నేఁడు నీవు మా కొనర్చిన సాయమునకు సంతోషము! నీవు మా సైన్యములోఁ జేరుము. నీకు మగధసింహాసన మిప్పింతుము."

"యవనేశ్వరా! మీ యాదరానురాగములకుఁ గృతజ్ఞుఁడను. ఆ పని మాత్రము నా చేతఁ గాదు. ఏల నందురా! మీరు భారతదేశమును గొల్లకొట్టుటకై యంత దూరము నుండి యింత దూరము వచ్చినారు. స్వదేశముపై దండెత్తి వచ్చిన పరదేశీయునకు పౌరుషముగల భారతీయుఁ డెవ్వఁడును "దాసోహ" మన లేఁడు."

"అదేమి! తక్షశిలాధీశ్వరుడు మాలోఁ జేరలేదా?"

"యవనేశ్వరా! అది దేశద్రోహుల లక్షణము. భారత సాధకవాటములు దెరచి పరరాజు నాహ్వానించిన "అంభి" ద్రోహి; స్వార్థపరుఁడు; నేను స్వశక్తితోనే మగధను జయించి తీరెదను. ఈ విషయమున పరదేశీయుల సాయము నేమాత్రమును గోరను."

"ఏమి నీ యౌద్ధత్యము! ని నిప్పుడు బంధించినచో నేమి చేయుదువు?"

"ఈ శరీరములోఁ బ్రాణముండగా, ఈ చేతిలోఁ గృపాణ ముండగా నది యసాధ్యము."

అని చంద్రగుప్తుఁ డనుచుండగనే యలెగ్జాండరు సేనాపతులకుఁ గనుసన్న చేసెను. చమూపతులు సమీపించిరి.

చంద్రగుప్తుని కరవాలము తళుక్కున మెఱసినది. చూచు చుండగనే చంద్రగుప్తుఁ డదృశ్యుఁడై నాఁడు.

అలెగ్జాండరు విభ్రాంతుడై "సెల్యూకస్! ఇదేమి? ఆ యువకుఁ డేడి?" యని యడిగెను.

"ప్రభూ! ఇదే భారతవీరుల చాకచక్యము. అనుప మాన మగు శస్త్రలాఘవము! అనన్యసామాన్య మగు పరా క్రమము!" అని సెల్యూకసు సమాధాన మిచ్చెను.

హెలీనా సంతోషాశ్చర్యములతో ఱెప్ప వేయక యిది యంతయుఁ జూచి తన్మయురాలగుచుండెను.

౫

అలెగ్జాండరు మగధను జయింపవలెనని కాంక్షించెను. కాని సైనికుల స్వదేశగమనవాంఛ నరికట్టుట యాతని కసా ధ్యమై పోయెను. ఆ కారణమున స్వాధీనరాజ్యములందెల్ల తన ప్రతినిధుల నియమించి గ్రీసుదేశమునకు పయనమైపోయెను. కాని మార్గమధ్యముననే అలెగ్జాండ రకాలమరణ మందెను. అతని యనంతరము సెల్యూకసు గ్రీసుసార్వభౌముఁడయ్యెను.

చంద్రగుప్తుని సైన్యసమీకరణము పూర్తియైనది. ఆ వీరాగ్రణి యుక్కుతునుకలవంటి ఆటవికుల నెల్లఱ సంఘ టితపఱచి వారికి గ్రీకుయుద్ధపద్ధతులు నేర్పి సమరవీరులుగా సలిపెను. అపార సేనావాహిని తయారయినది.

ఇంతలో చాణక్యుఁడు మగధలోఁ దన యత్నము లన్నియు సఫలములైనవనియు, బయలుదేరి సంగరసన్నాహ

ములతో పురోగమింపుమనియు చంద్రగుప్తునకు వార్త నంపెను. బలిష్ఠములగు కొండజాతిసైన్యములు వెంబడింప చంద్రగుప్తుఁడు మగధపై దండెత్తెను.

అట చాణక్యుఁడు పర్వతరాజునకు మగధపైఁ గన్ను గలదని గ్రహించి యతని కర్ధరాజ్యము కట్టబెట్టెదనని యాశ బెట్టెను. తత్ఫలితముగా పర్వతేశ్వరుఁడు శకబాహ్లీకపారశీకాది మిత్రసైన్యములు తన్ననుసరింప నసంఖ్యాకములైన స్వసైన్యములతో పాటలీపుత్రముపై జైత్రయాత్ర చేసెను.

ఇట్లు చతురంగబలసమేతుఁడై పర్వతరా జొకప్రక్కనుండియు, చంద్రగుప్తుఁడు వేఱొకప్రక్కనుండియు పాటలీపుత్రముపైఁ బడిరి. రాక్షసమహామాత్యుఁ డపారసేనావాహినితో నందరాజ్యమును సంరక్షింపనెంచి చంద్రగుప్తుని దాకెను. ఉభయసైన్యములకును పోరు ఘోరమయ్యెను.

భీకరకరవాలము కరమున ధరించి గిరగిరత్రిప్పుచు శత్రుశిరములఁ గుప్పతిప్పలుగా నఱకివైచుచు సమరరంగమున చంద్రగుప్తుఁడు వీరవిహారము సేయుచుండెను. ఆ యసమాన తేజోనిధి నడ్డుకొను వీరుఁ డెవ్వఁడు? ఆ యఖండ తేజోమూర్తి నాఁటిభండనమున ప్రచండమార్తాండుఁడై ప్రకాశించెను.

చాణక్యుని రాజనీతిప్రభావముచే భద్రభటభాగురాయణాది మగధసేనాధిపతులు చంద్రగుప్తుని పక్షమవలంబించిరి.

చంద్రగుప్తుని విజయలక్ష్మి సగౌరవముగా వరించినది. నందుని మృత్యుదేవత కౌగిలించినది. రాక్షసమహామాత్యుఁడు పరాజితుఁడై పలాయితుఁడైనాఁడు.

నందవంశ నిర్మూలన మయినది. అద్వితీయస్వామిభక్తుఁ డగు రాక్షసామాత్యుఁడు తన ప్రభువుపైఁ గల యభిమాన ముచే చంద్రగుప్తుని సంహరించుటకై పలు ప్రయత్నములు చేసెను. కాని చాణక్యుని నీతిప్రభావమున నవి యన్నియు నీరసములై నిష్ఫలము లయ్యెను.

రాక్షసుఁడు పరప్రాణాపహారిణి యగు విషకన్యను చంద్రగుప్తునికి బహుమానముగ పంపినాఁడు. కాని దానిని చాణక్యుఁడు తన బుద్ధిచాతుర్యముచే పర్వతేశ్వరునిపైఁ బ్రయోగించెను. విషయలోలుఁడగు పర్వతరాజు విషకన్యను కామాతురుఁడై స్పృశించి తత్క్షణమే యసువులు వాసెను. ఈ విధముగా చంద్రగుప్తసంహారమునకై పంపఁబడిన విష కన్య మగధరాజ్యమున భాగస్వామి యగు పర్వతేశ్వరుని పరిమార్చెను.

**చాణక్యుని ప్రతిజ్ఞ నెఱవేరినది.**

సమర్థుఁడును స్వామిభక్తుఁడు నగు రాక్షసుని చాణక్యుఁడు తన ప్రజ్ఞావైభవముచే వశముచేసికొని చంద్రగుప్తున కమాత్యుఁడగుట కంగీకరింపఁజేసెను.

మగధ రాజ్యమునకు చంద్రగుప్తుఁడు చక్రవర్తి యయ్యెను. రాక్షసుఁ డమాత్యపీఠము నలంకరించెను. చాణక్యుఁడు ప్రజాహితముగ రాజ్యముచేయుమని ప్రియశిష్యుని ఆశీర్వదించెను. చంద్రగుప్తుఁడు వినమ్రుఁడయ్యెను. చాణక్యుఁడు ప్రసన్నుఁడయ్యెను.

## ౬

"అమ్మా! హెలీనా! ఏల చింతించుచున్నావు? నీవు వెనుకటి హెలీనావు కావు. ఇప్పుడు గ్రీకుసార్వభౌముని పుత్రివి. నిరంతరమును సంతోషతరంగములలోఁ దేలియాడ వలసిన నీ కీ విచార మేలనమ్మా!!" యని సెల్యూకసు తన ముద్దుకుమార్తెను ప్రశ్నించెను.

"మన జీవిత మంతయు యుద్ధము లేనా? మఱల మగధ దేశముపై దండయాత్ర యేమి?" అని హెలీనా పలికెను.

"అవునమ్మా! అలెగ్జాండరు సాధింపలేని మహాకార్య మీా సెల్యూకసు సాధింప సమకట్టినాఁడు!"

తన జనకుని దురాక్రమణబుద్ధి హెలీనా కేమాత్ర మును నచ్చలేదు. ఆమె చింతాక్రాంతయై యాతని చెంతఁ గూర్చుండి యుండెను. నాఁటి సమరవృత్తాంత మామె స్వాంత మును కలవరపెట్టినది. నేఁడు తన జనకుఁడు చంద్రగుప్తునితో సమర మొనర్పఁ బోవుచున్నాఁడు! ఆమె యాపాదమస్తకము చలించిపోయినది. ఆమె హృదయము రెపరెప కొట్టు కొనినది.

"నాయనా! దారుణరణాంగణములే మీాకు విహార వనములు. రక్తపానముపై మీా కనురక్తి. ప్రాణదాతయగు భారతసామ్రాట్టుపై సమరమా? బాబా! యింత సాహసమా! ఇంత కృతఘ్నతయా!" అనినది.

"హెలీనా! నీకు రాజనీతి రహస్యములు తెలియవు. గ్రీకుపతాక పాటలీపుత్రము కోటకొమ్మపై నెగురువేయ

వలెను. యవనమార్తాండుని దివ్యదీప్తికి భారతశౌర్యాంధ కారము పటాపంచలు కావలెను. తెలిసినదా?”అని సెల్యూకసు లేచిపోయినాడు. రాకుమారి హెలీనా ఆలోచనలో మునిగిపోయినది.

చంద్రగుప్తుఁడు చతురంగబలములతో గ్రీకుసైన్యములను ప్రతిఘటించెను. బ్రహ్మాండమువలె నున్న భారత వాహిని విరోధిసైన్యములపై విఱుచుకొనిపడినది. ఈ మహా యుద్ధమున చంద్రగుప్తచక్రవర్తి స్వయముగా సర్వసైన్యాధిపత్యము స్వీకరించినాఁడు. మాతృదేశస్వాతంత్ర్యసంరక్షణార్థమై భారతవీరులు ప్రాణములు లెక్కచేయక ప్రళయ కాలరుద్రులవలె పగతురపైఁ బడి చించిచెండాడుచుండిరి.

సెల్యూకసు తన సైన్యమును సమధికోత్సాహముతో సమరమునకుఁ బురికొల్పుచుండెను.

చిట్టచివరకు “విజయశ్రీ” భారతసమ్రాట్టునే వరించినది. సెల్యూకసు భారతసార్వభౌముని ముందు బందీకృతుఁడైనాఁడు. హెలీనా బాష్పపూరితనేత్రములతో జనకునిప్రక్క నిలబడియున్నది. చంద్రగుప్తుని హృదయము సంచలించినది.

మగధచక్రవర్తి తన ముందు నిలబడియున్న సెల్యూకసు నవలోకించి “యవనచక్రవర్తీ! మీరు విముక్తులు. స్వేచ్ఛగ మీ దేశమునకుఁ బోవచ్చును” అని పలికినాఁడు.

చంద్రగుప్తుని యౌదార్యమునకు సెల్యూకసు విస్మితుఁడైనాఁడు. తాను జయించిన గాంధారము పాంచాలము మొదలగు రాజ్యములు చంద్రగుప్తునికిచ్చి సంధి చేసికొనినాఁడు.

"కయ్యము నెయ్యముగా మాఱినది. ఇఁక నెయ్యము వియ్యముగా మాఱినచో గ్రీకులకు భారతీయులకు పరస్పర మైత్రి చిరస్థాయికాఁగల" దని చాణక్యుఁడనెను. చంద్ర గుప్తుఁడు చిఱునవ్వున వ్వెను. హెలీనా మానసముప్పొంగెను.

సెల్యూకసు చాణక్యుని వాక్యములు గౌరవించినాఁడు. గ్రీకుచక్రవర్తి భారతచక్రవర్తికి మామ యైనాఁడు. యవన రాజకుమారి మగధసామ్రాజ్యమునకు పట్టపురాణి యైనది. హెలీనా చంద్రగుప్తుల కల్యాణము మహావైభవముగా సకల జన సంతోషప్రదముగా జరిగినది.

ఆ కల్యాణముచే భారతము "కల్యాణభారత" మైనది.

# ఉదార భారతము

## ౧

"గోరీ! నిన్ను మేము క్షమించితిమి."

ఈ మాటలకు ఢిల్లీ దర్బారంతయు నిస్తబ్ధమయ్యెను. పృథ్వీరాజు నోటినుండి యీ పలుకులు వెలువడునని యెవ్వరు నూహింపలేదు. చక్రవర్తి యీ పర్యాయముగూడ గోరీ నిట్లు క్షమించి విడిచిపుచ్చునని యెవ్వరును భావింపలేదు.

చక్రవర్తి చరణములముందు సగముచచ్చి శరణాగతుఁడై పడియున్న మహాబుద్దీన్ మహమ్మదుగోరీ కా పలుకులు విన్నంతనే పోయినప్రాణములు లేచివచ్చెను. అతఁ డాశ్చర్యముతో శిరమెత్తి ఢిల్లీశ్వరు నవలోకించి "నిజమేనా మహారాజా!" అనెను.

"అవును. మేము నిన్నీమాటుసైతము క్షమించితిమి. నీవు సుఖముగా నీపట్టణమునకుఁ బోవచ్చును."

సభయంతయు సార్వభౌముని వదనబింబము వైపు చూచెను. ఆ ముఖము ప్రసన్నగంభీరమై యలరారుచుండెను. ఆ చూపులలో దయాదాక్షిణ్యములు తాండవించుచుండెను. ఆ మాటలలో నౌదార్యము వెల్లివిరియుచుండెను.

"ప్రభూ! చంపదగిన శత్రువు చేఁజిక్కినప్పుడు క్షమించుట ప్రమాదకరము" అని మహామంత్రి పలికెను.

"మహారాజా! ఈతఁడు మన దేశముపై దండెత్తివచ్చుట కిది యేడవసారి. ఈతని దురాక్రమణబుద్ధికిఁ దగిన శిక్ష విధింపవలెను" అని సేనానాయకుఁ డనెను.

"గోరీకి భారతదేశములోనే గోరీ కట్టవలెను" అని సభలో కేకలు బయలుదేరెను.

"చక్రవర్తీ! కాలసర్పమును కరుణించి విడిచినచో కాటువేయకమానదు" అని చాంద్ మహాకవి వచించెను.

గోరీ ఈ తడవ తన చావు తథ్యమని తలంచెను. ఆతఁడు దీనదృక్కులతో సార్వభౌమునివదనమువంకఁ జూచెను. చక్రవర్తి ముఖము మఱింత గంభీరమయ్యెను.

"భయములేదు గోరీ! శరణాగతులను క్షమించుట భారతీయుల పవిత్రధర్మము. మా సేనానాయకుఁడు చాముండరాయఁడు నిన్ను సురక్షితముగ భారతదేశపరిసరములు దాటించి వచ్చును. పొమ్ము! ఇఁకనైన నీ బుద్ధి మార్చుకొనుము. పరదేశములపై దురాక్రమణలు జరుపకుము. భారతదేశముతో మైత్రి పాటింపుము."

అని పలుకుచున్న పృథ్వీరాజు వాక్యములకు "చిత్త" మని యతివినయము నభినయించుచు గోరి సేనానాయకుల వెంట సభాభవనమును వీడి వెడలిపోయెను.

ఈ విషయమున సభలో గుసగుసలు బయలుదేరెను. సార్వభౌముని యౌదార్యము సముచితముగాదని కొందఱు వ్యాఖ్యానించిరి. "ఎంత సత్కృవినయములు చూపి తప్పించు

కొని పోవుచున్నాఁడురా" యని కొందఱు కొరకొరలాడిరి. "అతి వినయము ధూర్తలక్షణ" మని కొందఱు పలికిరి. పగ బట్టిన పచ్చి బాలెంత పులివలె వీ డెప్పుడో పంజావిప్పి భారత భూమిపైఁ బడక మానఁడని కొందఱు భావించిరి.

అనంతరము మహారాజు యుద్ధరంగమున వీరవిహారము సలిపి విజయలక్ష్మిని సాధించిన శూరశిరోమణులకు పారితోషికములను పంచిపెట్టెను. పెక్కువిధముల సాయపడిన సామంత మండలేశ్వరుల నభినందించెను.

చక్రవర్తి కొలువు చాలించుచుండగా నొక సేవకుఁ డరుదెంచి "ప్రభూ! కన్యాకుబ్జమునుండి యొక వార్తాహరుఁడు వచ్చియున్నాఁ" డని విన్నవించెను. వానిని వెంటనే లోనికిఁ గొనిరమ్మని పృథ్వీరా జాజ్ఞాపించెను.

వార్తాహరుఁడు లోనికిఁ బ్రవేశించి మహారాజునకు నమస్కరించి యొక లేఖను సమర్పించెను. తమకు గర్భశత్రు వగు జయచంద్రుని యొద్దనుండి లేఖ యేమైయుండునా యని సందేహముతోనే పృథ్వీరాజు వేవేగ దానిని విప్పి లోలోపల నిట్లు చదువుకొనెను :

భారతచక్రవర్తీ! ప్రణామములు.

నేఁటికి మూఁడవనాఁడు నాకు స్వయంవర మేర్పాటుచేసినారు. అందఱు రాజుల కాహ్వానములు పంపినారు. మీకుమాత్ర మాహ్వాన మంపియుండలే దని తెలియుచున్నది; పైపెచ్చు మీకు మాఱుగ నొక

శిలావిగ్రహమును జెక్కించి స్వయంవరమంటప ద్వారము వెలుపల నుంతురట. నా జీవితము యధీనము. నా హృదయము మీ కర్పిత కేమియును దోచుటలేదు. అంతయు మీరా చించి నన్ను మహావిపత్తునుండి రక్షింపుడు. సాహసమును ప్రేమపురస్సరముగ మన్నింపుడు.

"జయచంద్రుడు స్వయంవరమునకు రమ్మని యాహ్వానించుచున్నాడా?" యని మహామాత్యుడనెను.

పృథ్వీరాజు మందహాసము చేయుచు "జయచంద్రుడు కాదు; సంయుక్తయే యాహ్వానించినది" అని పల్కెను.

౨

అది స్వయంవరమహామండపము. ఆ మహోత్సవమున కాహూతులై వచ్చిన రాకుమారు లందఱు తమతమ యాసనములపై బారులు దీర్చి కూర్చుండి యుండిరి. హార కిరీట కేయూరాది మణిమయభూషణముల ధగద్ధగలతో సభామండప మంతయు వింతకాంతు లీనుచుండెను.

అందొక ప్రక్క నవరత్న ఖచిత సింహాసనముపై జయచంద్రు డుపవిష్టుడై యుండెను. ఆయన దక్షిణపార్శ్వమున రాజకుమారి సంయుక్త సఖీయుక్తయై లజ్జావనతవదనముతో నిలబడియుండెను. నవయౌవనశోభాభాసమానయగు నామె అప్పుడే వికసించుచున్న గులాబివలె నుండెను.

మహోత్సవారంభమున మంగళఘంటిక మ్రోగెను సంయుక్త శృంగారరసాధిదేవతవలె పుష్పమాలతో ముందునకు సాగెను. రాకుమారుల హృదయాంతరములలో గాలివాన రేగెను. కాంక్ష లుబ్బితలూగెను. వారి యాశాపూరిత వీక్షణము లామె మోము దామర చుట్టు మూగెను.

ఎవరికివారు రాజకుమారి తన్నే వరించు ననుకొనుచుండిరి. సంయుక్త సమీపమునకు వచ్చుకొలఁది రాజకుమారులలో నానా విధములైన భావప్రకటనలు ప్రారంభమయ్యెను. ఒక భూపాలుఁడు తలపైనున్న సువర్ణకిరీటమును చక్కదిద్దికొనెను. ఇంకొక నరనాథుఁడు మెడలోనున్న ముత్యాలహారములను సవరించుకొనెను. మఱియొక మహీవల్లభుఁడు రత్నఖచితములైన భుజకీర్తులను గదలించెను. వేఱొక నరేంద్రుఁడు తన వజ్రపుటుంగరములను వెలువఱిచెను. ఒకఁడు దగ్గెను. ఒకఁడు సకిలించెను. ఒకఁడు భాగ్యము పండినట్లు ముందునకు మెడచాచెను. ఒకఁడు ఱొమ్ము విఱుచుకొని భీష్మించుకొని కూర్చుండెను. ఒకఁడు కొంటెగాఁ జూచెను. ఒకఁడు కోరమీసము మెలవైచెను. కాని రాజపుత్రి యాకలియుగ మన్మథులను కన్నెత్తియైన చూడలేదు.

సంయుక్త మూర్తీభవించిన సౌందర్య జ్యోతివలె చకచక ముందునకు సాగిపోవుచుండెను. జ్యోతి సమీపించినంతనే రాజకుమారుల ముఖములు కళకళలాడెను. జ్యోతి సాగిపోయినంతనే వెలవెలబోయెను.

సంయుక్త యింకను ముందునకు సాగిపోయినది. "అయ్యో! ఇదేమి? ఇంకను నాబిడ్డ ఎవరిని వరింపలేదే!" అని జయచంద్రుఁడు వ్యాకులపడుచుండెను.

రాజకుమారి ద్వారముకడకు వచ్చినది. అచ్చట ద్వారపాలకస్థానములో నిలబెట్టఁబడియున్న యొక రాతివిగ్రహము మెడలో స్వయంవరమాల యలంకరించినది. తత్క్షణమే యొక వీరాగ్రేసరుఁడు హయారూఢుఁడై వచ్చి రాజకుమారికిఁ జేయూతనిచ్చి గుఱ్ఱముపై నెక్కించుకొని యదృశ్యుఁడైనాఁడు. ఒక్క క్షణకాలములో నిదియంతయు నింద్రజాలమువలె జరిగిపోయినది. తళుక్కుమని మెఱుపు మెఱసినట్లైనది.

"మోసము! మోసము! పృథ్వీరాజు రాజకుమారి నపహరించుకొని పారిపోవుచున్నాఁడు. పట్టుకొనుఁడు! పట్టు కొనుఁడు" అను కేకలు సభాంతరాళమున మాఱ్ఱోగెను. జయచంద్రుఁడు చండప్రచండమార్తాండునివలె మండిపడి సింహాసనమునుండి క్రిందికి దుమికెను.

ప్రశాంతసాగరమున పెనుతుపాను రేగినది. స్వయంవర సభయంతయు హాహాకారములతో నల్లకల్లోలమైనది.

## 3

ఆ రాత్రి జయచంద్రునకు నిద్రపట్టలేదు. ఆతని నేత్రములు చింతనిప్పులవలె నెఱ్ఱవారియుండెను. ఆతని మానసము పరాభవాగ్నిలోఁ దుకతుక నుడికిపోవుచుండెను. అతఁడు

మంత్రాలోచనమందిరమునఁ బిచ్చిపట్టినవానివలె, మద్యపాన మొనర్చినవానివలె, దేలుకుట్టినవానివలె, నిప్పులుద్రొక్కిన వానివలె నటునిటు దిరుగుచుండెను. మధ్యమధ్య "ప్రతీ కారము ప్రతీకార" మని పటపట పండ్లు గొఱుకుచుండెను. ఆతని హృదయ మాలోచనలోఁ దేలిపోవుచుండెను.

"సంయుక్త యెంత సాహసము చేసినది! పృథ్వీరా జెంత మోసముచేసినాఁడు! అమాయకుఁడైన యనంగపాలుని మాయచేసి యీనాఁడు ఢిల్లీసామ్రాజ్యమునంతయు నప హరించి సింహాసన మెక్కినాఁడు. కపట వేషము ధరించి యీనాఁడు కన్యాకుబ్జభాగ్యలక్ష్మి యగు సంయుక్త నప హరించి గుఱ్ఱమెక్కినాఁడు. వానికెంత కండకావరము. పట్ట పగలు నా పట్టి నెత్తుకొని పారిపోవునా? మదీయ ప్రతాప ప్రభాపుంజముచే వాని దుర్మదాంధకారము పటాపంచలు గావింతును. వానిని బట్టుకొని బంధించుటకై చేసినప్రయత్న మెల్ల బూడిదలో పోసిన పన్నీరైనది. ఆహా! నిండుసభలో నా గౌరవము గంగలో కలిసిపోయినది. ఢిల్లీశ్వరునిపైఁ బగదీర్చుకొనవలెను. వానిని సర్వనాశనముచేసి తీరవలెను. అప్పటికి గాని నా హృదయమునకు శాంతి లభింపదు. ఈ పరాభవాగ్ని చల్లారదు."

జయచంద్రుఁ డీవిధముగా నాలోచించుకొను చుండెను. ఇంతలో నలుగురు మంత్రులు వచ్చి నమస్కరించిరి. వారందఱు చాలసేపు మంత్రాలోచనజరిపిరి. చిట్టచివరకు

మహమ్మదుగోరీని మఱల భారతదేశముపై దండెత్తిరమ్మని యాహ్వానించుటకే నిర్ణయము జరిగినది.

దురాలోచనము పూర్తియైనది. జయచంద్రుని కసుపు మంట కొంతవఱకుఁ జల్లారినది.

౪

ఢిల్లీపట్టణమందలి ప్రమోదోద్యానము. ఆ యుద్యానములో రాజదంపతులు విహరించుచుండిరి.

"సార్వభౌమా! నాఁడు మీరు సమయమునకు రాకపోయినచో నేనేమై పోయెడిదాననో?"

"దేవీ! నీ జనకుఁడు జయచంద్రుఁడు సమస్త భూపాలుర సమక్షమున నాకుఁజేసిన యవమానమునకుఁ జక్కని ప్రతిక్రియ సలిపితివి. ఆ మహాసభలో నా గౌరవము గాపాడితివి. నీ సాహసము శ్లాఘనీయము. నీ యచంచలప్రేమకు నా హృదయపూర్వక ధన్యవాదములు."

"మహారాజా! యిందు నన్ను శ్లాఘింపవలసిన దేమున్నది. నా విద్యుక్త ధర్మమును నేను నెఱవేర్చితిని."

"సంయుక్తా! జననీజనకులను వదలి పరపురుషుని వెంట బయలుదేరివచ్చుటయేనా నీ ధర్మము."

"పరిహాసములు చాలులెండు! మీరు నాకు పరపురుషులెట్లగుదురు? బాల్యముననే మిమ్ముఁ జూచితిని. మీ ధైర్యసాహసములు వింటిని. నన్ను మీ కర్పించుకొంటిని. నా హృదయేశ్వరునిగా వరించి స్వయంవరములో మీ కంఠమునఁ

బుష్పమాలిక వైచితిని. మీ కర్ధాంగినైతిని. ఇందధర్మ మేమున్నది?"

"పాపము మీతండ్రి జయచంద్రుఁ డెంతబాధ పడు చున్నాఁడో? నన్నెంత నిందించుచున్నాఁడో?"

"స్వయంకృతాపరాధమున కెవ రేమి చేయఁగలరు? మాతండ్రి స్వార్థపరుఁడు. కుటిలస్వభావుఁడు. భారతదేశమును ఖండఖండములుగా ఖండింపఁ బ్రయత్నించుచున్నాఁడు. భారత సార్వభౌములైన మీపైఁ గత్తికట్టి ఎన్నియో పర్యాయములు యుద్ధములు చేసినాఁడు. రాజులలో రాజులకు విరోధములు పెంచుచున్నాఁడు. స్వయంవర మహోత్సవమునకు భారత చక్రవర్తులగు మిమ్మాహ్వానింపక మహాపరాధము చేసినాఁడు. సార్వభౌముఁడు లేనిదే స్వయంవర మెవరికోసమో!"

"రాజకుమారీ! మనలను బంధించుటకై పెద్ద సైన్య మును బంపినాఁడు. కాని మనసేనలు వారిని తరిమికొట్టినవి. ఇంతకు సంయుక్తాదేవి పవిత్రప్రేమయే ఈ మహావిజయమున కంతటికిఁ గారణము."

సంయుక్త యధరపల్లవముపై నొకమధుర మందహాస ముదయించినది. ఇంతలో నొక చారుఁడరుదెంచి "ప్రభువుల వారికి జయము జయము! జయచంద్రుఁడు మిమ్ము జయించు టకై చతురంగబలములతో రమ్మని మహమ్మదుగోరీకి దూత లను బంపినాఁడు." అని పల్కెను.

సంయుక్త సంభ్రమముతో "ఏమీ! మా తండ్రియా! గోరీని దండెత్తి రమ్మనినారా! ఎంతద్రోహము" అని పలికినది.

సార్వభౌముఁడు "దేవి! భయపడవలసిన పనిలేదు. ఆ గోరీ యిప్పటి కేడుమారులు భారతదేశముపై దండెత్తివచ్చి నాచేఁ బరాజితుఁడై ప్రాణములు దక్కించుకొని పలాయనము చిత్తగించినాఁడు. మొన్న నేకదా! మన్నించి విడిచిపుచ్చితిని."అని పలికెను. సంయుక్త "ప్రభూ! ఇప్పుడు కర్తవ్యమేమి? అనెను. పృథ్వీరాజు "దేవీ! విదేశరాజులు మనపై దండెత్తివచ్చుటకు స్వదేశీయుల స్వార్థపరత్వమే కారణము. ఎవరు వచ్చినను సుస్థిరమగు ఢిల్లీసామ్రాజ్యమును సుంతయైనను జలింపఁ జేయలేరు. నేను రాజసభకుఁ బోయి మహామాత్యులతో నాలోచించి వచ్చెదను. నీ వంతఃపురమున నేగుము." అని పలికి పృథ్వీరాజు వెడలిపోయెను. సంయుక్త తన జనకుఁడైన జయచంద్రుని ద్రోహబుద్ధికి మిక్కిలి చింతించి ఆయన మనస్సు మరల్చుటకై యొక లేఖవ్రాయ సంకల్పించెను.

౫

ఆహ్వాన మందిన వెంటనే యవకాశమునకై యెదురు చూచుచున్న గోరీ యసంఖ్యాకములగు సైన్యములతో మఱల భారతభూమిపైకి దండెత్తివచ్చెను. దేశాభిమాన శూన్యుఁడగు జయచంద్రుఁడు గోరీకి స్వాగతమిచ్చెను. మఱికొందఱు స్వార్థపరులగు రాజు లీ దురాక్రమణకుఁ దోడ్పడినారు.

ఉభయపక్షములకు భయంకర సంగ్రామము జరిగినది. పృథ్వీరాజు తన యఖండ సేనానీకముతో ననుపమాన ధైర్య సాహసములతో శత్రువుల నెదుర్కొనినాఁడు. సంయుక్తాది

వీరనారీమణులు కవచములను ధరించి ఖడ్గధారిణులై దుర్గ సంరక్షణమునకు నిలిచినారు. కాని దైవము ప్రతికూలమైనది. ఈ పర్యాయము గోరీమహమ్మదుకు జయము ప్రాప్తించినది. పృథ్వీరాజు బందీకృతుఁడైనాఁడు. సంయుక్త మొదలగు సతీ మణులు చితులుజొచ్చి తమ మానములు రక్షించుకొనిరి.

౬

జయచంద్రుఁడు ఢిల్లీ సింహాసనముపైఁ గూర్చుండి కులుకుచున్నట్లే స్వప్నములు గాంచుచున్నాఁడు. అతఁడు తన మిత్రుఁడగు మహమ్మదుగోరీని పంపివేసి తానే భారత సార్వభౌమపదవి నలంకరించుటకై యువిళ్లూరుచున్నాఁడు.

జయచంద్రునకు మెళుకువ వచ్చినది. ఆతఁడు సౌధో పరిభాగమునుండి క్రిందికి దిగబోయినాఁడు. ఇంతలో నొక సేనానాయకుఁడు వచ్చి "మహారాజా! మీరు క్రిందికి దిగు టకు వీలులేదు" అని పల్కెను. జయచంద్రుఁ డాగ్రహావేశ ముతో "ఇది యేమి" అని ప్రశ్నించెను. ఇది "గోరీ గారి యాజ్ఞ" అని సేనాపతి బదులుచెప్పెను.

"తెల్లవారుచున్నది. నేను ఢిల్లీ సింహాసన మెక్క వలెను. నన్ను పోనిమ్ము!

"గోరీ గారు దాని నీపాటి కెక్కియేయుందురు?"

"అయిన మేము మా సైన్యములతో మా రాజధాని యగు కన్యాకుబ్జమునకు బోవలయును."

"సైన్యములు మీ రాజధానికి నిన్ననే పోయినవి."

"ఎవరి సైన్యములు?"

"మహమ్మద్ గోరీ సైన్యములు"

"ఎందులకు?"

"మీ రాజ్యము నాక్రమించుకొనుటకు"

జయచంద్రుని నెత్తిపైఁ బిడుగుపడినట్లయ్యెను. తన ప్రాణమిత్రుఁడగు గోరీ తన్నింత ద్రోహముచేయునని యా బుద్ధిమంతుఁ డూహింపలేదు. "అయినచో మేమీ సౌధములో బంధింపఁబడితి మన్నమాట!" అని యతఁడు సేనాపతిని బ్రశ్నించెను. "అందులకు సందేహమేమున్నది" అని సేనాధ్యక్షుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

జయచంద్రుఁ డామాటవిని నిశ్చేష్టుఁడయ్యెను. తాను చేసిన పాపమున కిది ప్రాయశ్చిత్తముగా నతనికిఁ దోఁచెను.

ఇంతలో నొక సేవకుఁ డరుదెంచి 'మా గోరీ ప్రభువు మీ కీయుత్తరము పంపినారు. ఇది మీ కుమార్తె యగు సంయుక్త మీకు వ్రాసినదట." అని లేఖను జయచంద్రున కిచ్చి వెడలిపోయెను. జయచంద్రుని గుండెలు దడదడకొట్టుకొన్నవి. కరములు గడగడ వడఁకినవి. ఆ లేఖను స్పృశించుటకు సైతము తన కధికారము లేదని వాని మానసములో ప్రతిధ్వనించెను.

అతఁడట్లే నిలబడి లేఖను విప్పెను. తన ముద్దులబిడ్డ ముత్యములవంటి యక్షరముల నతఁడు గుర్తించెను. అతని కన్నులవెంట బాష్పబిందువులు జలజలరాలెను. అందలి ప్రతివాక్యమును జయచంద్రుని గుండెలను గలంచివైచెను.

ప్రతిపదమును హృదయము నుత్తూతలూపెను. ప్రత్యక్షర మును బాకువలె గ్రుచ్చుకొనెను.

అతఁడా లేఖను గద్గదస్వరముతో నిట్లు పఠించెను.

"తండ్రీ! నమస్కారము! నా తప్పు క్షమింపుఁడు! మీ యల్లుని యపరాధమును మన్నింపుఁడు! మాపైఁగల యాగ్రహముచే భారతదేశమును పారతంత్ర్య పాశములలో శాశ్వతముగా బంధింపకుఁడు!"

"ప్రియజనకా! మీరు పెద్దలు. అనుభవము గలవారు. మంచిచెడ్డలు తెలిసినవారు. ఒక్కమాటు నిండు హృదయముతో నాలోచింపుఁడు! ఒక్కపర్యాయము వెనుకకు తిరిగి చూచుకొనుఁడు! ఒక్కసారి పవిత్రమాతృభూమిని వీక్షింపుఁడు!

పూజ్య పితాజీ! నాపై మీ కాగ్రహముగలదేని, పృథ్వీరాజును మీరు సాధింపనెంచితిరేని మీరే స్వయముగా ఢిల్లీరాజ్యముపై దండెత్తి రండు. మమ్ములను జయించి సింహాసనము స్వాధీనము చేసికొండు. అంతేకాని విదేశీయుల నాహ్వానింపకుఁడు. జన్మభూమి దాస్యమును జేతులార కొని తెచ్చుకొనకుఁడు. వ్యక్తిగతద్వేషములతో దేశమును దిక్కులేని దానినిగాఁ జేయకుఁడు. అంతఃకలహములు పెంచుకొని యాత్మగౌరవమును గంగలోఁ గలుపకుఁడు. మచ్చరములు హెచ్చించుకొని మాతృదేశసౌభాగ్యమును మంటబెట్టకుఁడు.

తండ్రీ! మీరు తప్పుమార్గమునఁ బోవుచున్నారని తెల్పుటకు చింతించుచున్నాను. దురాక్రమణదారులకు

బోవుచున్నారని వినుటకు విచారించు
శ్యామలయగు మాతృదేవి రత్నగర్భముపై
ద్రొక్కుడుబిళ్లలాడు టుచితముకా దని

...కుఁడు! తరతరాలకు యుగ
...పౌరులు మిమ్మెంత దూషింతురో
...శ చరిత్రలో మీచరిత్ర మెంత నీచాతి
...తి హీనముగ లిఖింపబడునో స్మరించితిరా?
పాడవలసిన కన్నతండ్రులవంటి మహారాజులే కయ్య
ములకుఁ గాలు దువ్విన దేశమున శాంతిభద్రతల కిక తావుండఁ
బోదని యూహించితిరా? "జయచంద్రుఁడు దేశద్రోహి"
యని మిమ్మాబాల గోపాలము దుమ్మెత్తి పోయుదురని
కొంచెమైన భావించితిరా?

ఆలోచింపుఁడు. తొందరపడకుఁడు. చేతులుకాలిన
వెనుక నాకులు పట్టుకొనినఁ బ్రయోజన ముండదు. కర్తవ్య
మును గుర్తింపుఁడు. కన్న తల్లిని గుర్తింపుఁడు. దురాలోచన
త్యజింపుఁడు. దూరాలోచన చేయుఁడు! ఈ లేఖను హృదయ
పూర్వకముగఁ జదివి నా ప్రార్థనమును వ్యర్థము చేయకుఁడు.

ఇట్లు
మీ ముద్దులకుమారి
"సంయుక్త"

జయచంద్రుఁడిక నిలబడ లేకపోయెను. అతని తల తిరిగి పోవుచుండెను. ఆహా! నేనెంత పాపాత్ముఁడను. దేశమును సర్వనాశనము చేసితిని. దురాగ్రహముతో, దురావేశముతో పృథ్వీరాజుపైఁ గత్తిగట్టితిని.

అయ్యో! ఇది యుద్ధమునకు ముందు వ్రాసిన యుత్తరమే! ఇది నాకిప్పుడు చేరుట యేమి? ఓహో! తెలిసినది. ఇది యంతయు గోరీ చేసిన కుతంత్రము. ఈ లేఖ వాని చేతికిఁ జిక్కియుండును. దీనిని నేను జూచినచో మనస్సును మార్చుకొందునేమో యని తనయొద్దనే దాచియుంచి యిప్పుడు నాకంపినాఁడు.

ఆహా! నేను ద్రోహిని! దేశద్రోహిని! మహావీరాధివీరుఁడగు పృథ్వీరాజునకు మామ యను మర్యాద దక్కించుకొనలేకపోయితిని. సాధ్వీశిరోమణి యగు సంయుక్తకు జనకుఁడనను గౌరవము నిలబెట్టుకొనలేకపోయితిని. నా స్వార్థమే నన్నింత చేసినది."

జయచంద్రుఁడు పొంగివచ్చు దుఃఖావేశము నాపుకొనలేకపోయెను. అతఁడు చరచర తన గదిలోనికిఁ బర్వెత్తి గవాక్షమునుండి క్రిందికి తొంగిచూచెను.

యమునానది గంభీరముగఁ బ్రవహించుచుండెను. ఆ ప్రవాహము పరతంత్రయైన భారతమాత "కాటుక కంటినీరు" వలె జయచంద్రుని కన్నులకుఁ గాన్పించెను. ఆ ప్రవాహమధ్యమున భగభగ మండుచున్న చితిలోఁ బడి భస్మమై

పోవు సంయుక్త "తండ్రీ తండ్రీ" యని తన్ను పిలుచుచున్న ట్లుండెను. ముప్పది మూడుకోట్ల భారతీయుల కంఠములు "నీచాత్ముడా!" యని తన్ను నింధించుచున్నట్లు విన్పించెను.

జయచంద్రుఁడా భయంకర శబ్దమును వినలేక పోయెను. గవాక్షమునుండి యతఁడా నదీజలములలోనికి దుమికెను. యమున గంభీరముగ నట్లే ప్రవహించుచుండెను.

## ౭

అది గాఢాంధకారబంధుర మగు కారాగారము. ఆ చీకటికొట్టులో నొకమూల భారతచక్రవర్తి బందీకృతుఁడై పడియున్నాఁడు. ఆయన శరీరము ధూళిధూసరితమై యున్నది. ఏ వీరశిరోమణి, ఏ యుదారహృదయుడు, ఏదయాసముద్రుఁడు చేఁజిక్కిన తన్ను క్షమించి సగౌరవముగ విడిచిపెట్టెనో ఆ పృథ్వీరాజును గోరీ కృతఘ్నుఁడై కన్నులూడఁ బెఱికించి కారాగారములోఁ ద్రోయించినాడు.

చెఱసాలలో శృంఖలాబద్ధుఁడై క్రుంగి కృశించిపోవుచుఁ గూర్చుండియున్న చక్రవర్తికి "మహారాజా" అను పిలుపు వినిపించినది. పృథ్వీరాజున కాకంఠస్వరము సుపరిచితమైనదే.

"ఎవరు? మహాకవి చాంద్ భట్టా!?"

"అవును ప్రభూ! నేనే!"

"మహాకవీ! మిమ్ములను దర్శించుటకు నయనములు లేవు. కౌగిలించుకొనుటకు హస్తములకీ కఠోరశృంఖలలు--"

చక్రవర్తినోట మాటరాలేదు. మహాకవి పృథ్వీ రాజును గాఢాలింగన మొనర్చుకొని బాలునివలె వలవల

యేడ్చెను. కన్నులు గోలోపోయి కళావిహీనమైయున్న చక్ర వర్తి ముఖము వీక్షించినంతనే చాంద్ భట్టునకు గుండెలు నీరయ్యెను.

"మహారాజా! ఏమిటీ యాకారము! నా ప్రభువున కెంతలో నెంత మార్పు వచ్చినది?"

"మహాకవీ! సంయుక్త మొదలగు రాణివాసపు స్త్రీల గతి యేమైనది?"

"ప్రభూ! వారందఱు చితులలో దుమికి తమ సతీత్వ మును నిలుపుకొనిరి. గోరీ బూడిద రాసులతో స్మశానప్రాయ మైయున్న ఢిల్లీకోటలోఁ బ్రవేశించి రాజసింహాసనము నధిష్ఠించినాఁడు."

"మహాకవీ! ఈ నికృష్ట జీవితము నేనిక భరింపజాలను. నీ చేతిలోఁ గృపాణమున్నచో నా గుండెలలో గ్రుచ్చి నీ ప్రభువునకు శాశ్వత విముక్తిని ప్రసాదింపుము."

"మహారాజా! కొంచెము కాల మోర్చుకొనుడు. తే పీపాటికి మన యిర్వురకు శాశ్వతవిముక్తి సంప్రాప్తించఁ గలదు. దానికి ముందు కృతఘ్నుఁడగు గోరీకి ప్రతీకారము జరిగితీరవలెను."

"మహాకవీ! నీ విచ్చట కెట్లు రాగలిగితివి?"

"ఫకీరు వేషము ధరించి కవిత్వముచెప్పి గోరీ యాస్థాన ములో మంచి గౌరవము సంపాదించితిని. ఢిల్లీ కోటలో నేఁడు నా మాటకు తిరుగు లేదు."

"మహాకవీ! దేశద్రోహి జయచంద్రుఁ డేమైనాడు?"

"ఆ దుర్మార్గునకుఁ దగిన దుర్మరణమే ప్రాప్తించినది. ఢిల్లీ పట్టణము స్వాధీనము చేసికొనినవెంటనే గోరీ కన్యాకుబ్జముపైఁగూడ సైన్యములను బంపినాఁడు. జయచంద్రుని బందీకృతుని జేసినాఁడు. ఆ పాపాత్ముఁడు తన పాపమునకుఁ బశ్చాత్తాపపడి తలబ్రద్దలు కొట్టుకొని యమునలో దుమికి ప్రాణములు గోల్పోయినాఁడని ప్రజలు చెప్పుకొనుచున్నారు."

"మహాకవీ! భారతదేశమున కెట్టి దుర్దశ ప్రాప్తించినది."

"మహారాజా! కడచినదానికి విచారింపకుఁడు. రేపే గోరీ మహమ్మదు సభ జరుపును. ఆ దర్బారులో నీ శబ్ద భేది విద్యాప్రదర్శనము - ప్రతీకారము - శాశ్వతవిముక్తి - శాశ్వతశాంతి - అన్ని యేర్పాట్లు సిద్ధము చేసితిని."

"మహాకవీ! హృదయమునకు శాంతి కల్గించితివి. ఈ యంత్యసమయమునఁగూడ నన్ను మఱచిపోలేని నీ రాజభక్తికి ధన్యవాదములు. అఖండమైన నీదేశభక్తికి జోహారులు.

ఇట్లు మఱికొంతసేపు మహాకవి పృథ్వీరాజుతో నేమేమియో మాటాడి సెలవు గైకొని వెడలిపోయెను.

౮

మఱునాఁడు మహమ్మదుగోరీ కొలువుదీర్చినాఁడు. రాజ పరివారముతో సభ కిటకిటలాడుచున్నది.

"ఏడి! యింకను రాజు రాలేదే." అని గోరీ ఫకీరును జూచి పలికెను.

"తొందరపడకుడు. అదుగో! వచ్చుచున్నాఁడు" అని ఫకీరు ప్రత్యుత్తర మొసఁగెను.

ఇంతలో రాజభటులు శృంఖలాబద్ధుఁడైన పృథ్వీరాజును సభలోనికిఁ గొనివచ్చిరి. చేతులనున్న గొలుసు లూడదీసిరి. ధనుస్సును బాణములును చేతి కందిచ్చిరి.

ఏ సింహాసనముపై పృథ్వీరాజు కూర్చుండి గోరిని క్షమించి విడిచిపెట్టెనో ఆ సింహాసనముపై నేఁడు గోరీ యుపవిష్టుఁడై యుండెను. గోరీ పృథ్వీరాజునుజూచి "మహారాజాగారు మాకు కొంచెము వినోదము కల్గింతురా" యనెను. ఫకీరు "కొంచెము కల్గించుటయేమి? రాజావారు తమ శరప్రయోగ చాతుర్యముచే సంపూర్ణముగనే మీకు సంతోషము కల్గింతురు" అని యుచ్చైస్స్వరమునఁ బల్కెను.

గోరీ గంభీరముగాఁ దలయూఁపెను. దూరమున గంట ప్రమోగింపఁబడుచుండెను. రాజు విల్లెక్కుపెట్టెను. ఫకీరు పృథ్వీరాజు నాలోకించి "మా సుల్తానుగారు ముందుగానే నీ గ్రుడ్లుపీకించి కనులకు గంతలు కట్టవలసిన పనిలేకుండ చేసినారు. ఏది నీ శబ్దభేది విద్యావిశేషము! ఆ గంటను కొట్టుము. నీ తెలివితేటలకు మెచ్చుకొని ప్రభువులు బహుమానమిత్తురు" అని పలికెను.

మఱల గంట ప్రమోగెను. ధనస్సునుండి ఱివ్వున బాణము వెడలెను. గంట ముక్కలు ముక్కలై నేలపైఁబడెను. సభ్యులందఱు "మేలు మే"లని కరతాళ ధ్వనులు చేసిరి. గోరీమహామ్మదు "సెబాసు సెబాసు"అని యఱ

చెను. తత్‌క్షణమే మఱియొక బాణము జివ్వున వచ్చి గోరీ గుండెలలో గ్రుచ్చుకొనెను. గోరీ యార్తనాదముచేసి నేల కొరగి ప్రాణములు బాసెను.

వెంటనే "మహారాజా!"యని ఫకీరు పృథ్వీరాజును కౌగిలించుకొనెను. పృథ్వీరాజు "మహాకవీ!"యని ఫకీరును కౌగిలించుకొనెను. గుప్తఖడ్గములతో నొకరి నొకరు పొడుచు కొనిరి. రాజసభ రక్తప్లావితమయ్యెను.

వారిరువురి యాత్మలకు శాశ్వత శాంతి లభించెను.

చంపదగిన శత్రువు చేతఁజిక్కినను తన యుదార స్వభావముచే నేడు పర్యాయములు విడచిపుచ్చిన భారత చక్రవర్తి వీరచరిత్ర మీ విధముగ విషాదాంత నాటకము వలె సమాప్తమయ్యెను.

# ప్రసన్న భారతము

## ౧

ఆనాఁడు విజయదశమి. కాకతీయాంధ్రసామ్రాజ్య రాజధానియైన యేకశిలానగరమంతయు నత్యంత మనోహరముగ నలంకరింపఁబడినది. పౌరు లందఱు ప్రమోదపూర్ణములగు ముఖములతో రాజ భవనము జేరవచ్చుచుండిరి.

సభాభవనము రమణీయ రత్నాలంకారములతో ధగధగ మెఱసి పోవుచుండెను. సామంతమండలేశ్వరు లొక ప్రక్కను మంత్రిపుంగవులు మఱియొక ప్రక్కను, వీర సేనానాయకులు వేఱొక ప్రక్కను యథోచిత స్థానములలో నుపవిష్టులై యుండిరి. పురజను లాబాలగోపాలము కుతుహలాయత్త చిత్తులై గూర్చుండి యుండిరి.

మంగళవాద్యములు మ్రోగినవి. కాకతీయ గణపతి దేవచక్రవర్తి సభ్యుల జయజయ ధ్వానములతో నాస్థానమండపమున కరుదెంచినాఁడు. వందిమాగధులకై వారములు భూనభోంతరములఁ బ్రతిధ్వనించినవి. ఆ మహారాజువెంట నొక పదునాఱేండ్ల రాజకుమారుఁ డుండెను. సభ్యులందఱు సంతోషపరవశులై ప్రశాంతసుందరమగు నా రాజనందనుని పదనారవిందమును ననిమిషనయనములతో నాలోకింపసాగిరి.

చక్రవర్తిరాకకు సభయంతయు గౌరవపురస్సరముగ లేచి నిలువబడి కొంతవడి నిశ్శబ్దముగ నుండెను. ఇంతలో

గణపతిదేవుఁడు పట్టపుటేనుగును దిగి, రాజకుమారుని చేయి గ్రహించి మహామంత్రి మార్గము చూపుచుండ వచ్చి వజ్ర సింహాసనము నధిష్ఠించినాఁడు. రాకుమారుఁడు రాజుగారి కెడమప్రక్కనున్న పచ్చలగద్దియపైఁ గూర్చుండినాఁడు. మహామంత్రి శివదేవయ్య రెండవవైపు బంగారు సింహాసన ముపై నాసీనుఁడైనాడు. సభాసదు లందఱు మఱల తమతమ పీఠముల నలంకరించినారు.

గణపతిదేవ చక్రవర్తి నిజాసనమునుండి లేచి గంభీర ముగా నిట్లుపన్యసించినాఁడు.

"ఆంధ్రమహాజనులారా! మంత్రి సామంత సైన్యా ధ్యక్షులారా! సర్వసమర్థులు, శక్తిసంపన్నులు, సాహసోపేతులు నగు మీయందఱి సహాయసంపత్తితో నింతవఱకు నీ విశా లాంధ్ర సామ్రాజ్య భారమును నా భుజస్కంధమున వహించి తిని. ప్రజాభ్యుదయమును దృష్టిలో నుంచుకొని పరిపాలించి తిని. విరోధి శీర్షములు వినమ్రములు కావించితిని. సాధ్య మైనంతవఱకు సామ్రాజ్యమును విస్తరింపఁజేసితిని.

సోదరులారా! నే నిప్పుడు వృద్ధుఁడనైతిని. శరీరమున జవసత్వము లుడిగిపోయినవి. దుర్బలమైన నా భుజస్కంధ మీ సామ్రాజ్యభారము నిఁక భరింపలేదు. నేఁటి నుండియు మీకీ రాజకుమారుఁడే ప్రభువు. మీ యందరిసమ్మతి నందుకొని వీని నీ విశాలాంధ్రసామ్రాజ్యమునకుఁ జక్రవర్తినిగా నభిషే కించుచున్నాను."

అని పల్కి మహారాజు రాజకుమారుని వజ్రసింహాస నముపైఁ గూర్చుండబెట్టెను. మహామంత్రి శివదేవయ్య మణిమయ కిరీటమును బాలరాజు శిరముపై నలంకరించెను. కులగురువులు మంత్రపూతములగు జలములతో నభిషేకించిరి. సభయంతయు మందహాసముతో, మహానందముతో చేతులెత్తి జేజేలు సమర్పించినది. తూర్యధ్వనులు మిన్నుముట్టినవి. పుణ్యపురంధ్రీమణులు కర్పూర నీరాజనము లెత్తిరి. సభ్యులు పుష్పవృష్టి గురిపించిరి.

కాని యిరువురు పురుషులు మాత్రము చిరాకుతో, నిరాశతో మొగములు మటమట మాడ్చుకొనుచు సభా మండపమును విడిచి చనిరి.

౨

గణపతిదేవచక్రవర్తికి పుత్రసంతానములేదు. ధర్మపత్ని యగు సోమాంబయందు ఆయనకు రుద్రాంబ, గణపాంబ యను నిరువురు పుత్రికలు మాత్రము జన్మించిరి. ప్రాజ్ఞుఁడగు గణపతి దేవచక్రవర్తి పురుషసంతానము లేనందుకు కేమాత్రము చింతాక్రాంతుఁడు కాలేదు. ఆయన తన పుత్రికలనే పుత్రు లనుగా భావించి వారికి వీరోచితములగు విద్యలు నేర్పించెను. రుద్రమ్మ బాల్యమునుండియు ధనుర్విద్యయందుఁ దగిన సామ ర్థ్యము సంపాదించినది. కత్తిసాము, గుఱ్ఱపుస్వారి మొదలగు వానియందు ప్రావీణ్యము గడించినది. కామందక కౌటిల్యాది శాస్త్రముల నభ్యసించి రాజనీతి రహస్యములనెల్ల నాకళించు

కొనినది. సామదానభేద దండోపాయముల గ్రహించినది. తనజనకునితోఁ దానుగూడ ననేక యుద్ధరంగముల కేగి వ్యూహరచనము, సైనికవిన్యాసము మొదలగు విషయములను ప్రత్యక్ష ప్రమాణములతో నేర్చుకొనినది.

రుద్రమదేవి పురుషవేషము ధరించి తన తండ్రివెంట ననుదినము నాస్థానమండపమున కరుదెంచుచుండెడిది. ఆయనతోఁబాటు రాజకార్యములను బరిష్కరించి తన ప్రజ్ఞావిశేషములను బ్రకటించుచుండెడిది.

ఈనాఁడా వీరనారీమణి యాంధ్ర సామ్రాజ్యపీఠ మధిష్ఠించినది. తన జనకుని యనంతరము రాజ్యభారమును వహించి ప్రజారంజకముగ పరిపాలనము సాగించినది.

## 3

ఒకయబల యాంధ్రసామ్రాజ్యమున కధీశ్వరి యగుట చూచి "హరిహర" "మురారు"లకు కన్నులు గుట్టినవి. కడుపు భగ్గుమన్నది. వారా రాజ్యప్రదాన మహోత్సవమును సందర్శింపలేకపోయిరి. వీరే నాఁడు సభనుండి వెడలిపోయిన పెద్దమనుష్యులు.

దురభిమానపిశాచగ్రస్తులగు వీరిరువురకు రుద్రమదేవి తెలుగురాణి యగుట భరింపరాని పరాభవముగాఁ దోఁచినది. ఒక యాఁడుదాని పాలనమునకు లొంగిపోవుట వారి కవమానకరముగ దట్టినది. ఒక మహిళ పాదపీఠమునకు మణిమయ మకుటాంచితములగు మౌళిభాగములువంచి జోహారులొనర్చు

టకు వారి యంతరాత్మ లంగీకరింపలేదు. ఆంధ్రవీరనారీమణి లోఁగల మహోజ్వల శక్తిసామర్థ్యములు విశ్వవిఖ్యాత రాజ నీతిజ్ఞతలు వారి తలల కెక్కలేదు. మానవతియు, మాతృ మూర్తియు, మహాశక్తిస్వరూపిణియు నగు మహిళామణిలో గల మహత్వమును వారు గుర్తింపలేక పోయిరి.

ఇకనేమి! మురారి హరిహరులు దురాలోచనకు గడంగిరి. రుద్రమదేవి నెక్కిన సింహాసనమునుండి దింపి యాంధ్రసామ్రాజ్య పీఠము నధిరోహింప వలెనని, వారాకాశ సౌధములు గట్టుకొనుచుండిరి.

"మురారీ! నీవు నూఱు చెప్పుము వేయిచెప్పుము. నే నాడుదాని యాధిపత్యము నంగీకరింపను."

"హరిహరా! ఆవేశమునకు లోనుగాకుము. ఆడుదాని యడుగులకు మడుగులొత్తుటకు నేనుమాత్రమంత యభిమాన హీనుఁడ ననుకొంటివా? కాని మనము తొందరపడిన కొంప లంటుకొనును. ఆ శివదేవయ్య యాపులించిన ప్రేవులు లెక్క పెట్టఁగల కాలాంతకుఁడు."

"ముసలి రాజు బ్రతికియున్నంతవఱకును మన యాటలు సాగినవి కావు. ఇఁకచూడుఁడు మీ హరిహరుని బుద్ధివైభవము! ఆంధ్రసామ్రాజ్యము నల్లకల్లోలము చేసివైతును. రుద్రమదేవి యధికారమును రూపుమాపెదను. శివదేవయ్య మంత్రాంగ మును చించిచెండాడెదను."

సోదరా! బలద్విరోధము ప్రాణాంతకమని పెద్ద లందురు. ఉపాయములతో మన కార్యములు సాధించు

కొందము. ఆంధ్రదేశములో నలుమూలల విప్లవము రేపుదము. ప్రభుత్వముపై వ్యతిరేకప్రచారము గావింతము. సమయము జూచి చతురంగబలములతో దుర్గమును ముట్టడింతము."

"ఇప్పుడే మన బలములతో దుర్గమును స్వాధీనము చేసికొనినచో నెట్లుండును."

"దుర్గమును ముట్టడించుట సామాన్యమగు పనికాదు. ఉక్కుతునుకలవంటి దుర్గరక్షకులను జయించుట నోటి మాటలుగాదు."

"మురారీ! పిఱికిమందు పోయకుము. నేను చెప్పినట్లు వినుము. ఆడుదానిని జయించుటకుఁగూడ నిన్ని యాలోచన లెందుకయ్యా! ఈనాఁటినుండియే కాకతీయసామ్రాజ్య మునకుఁ గప్పముగట్టుట మానివేయుదము. ఆమె మనలను తలగొట్టి మొలవేయునదేమో చూతము."

"మన మండలములపై దండెత్తినచో——"

"ఆడుదాని కంత ధైర్య మెక్కడనుండి వచ్చునోయీ పిచ్చివాడా! ఒకప్రక్క పాండ్యులు కత్తిదూయుచుండిరి. ఇంకొకప్రక్క చోళరాజులు విజృంభించుచుండిరి. మఱియొక ప్రక్క కటకాధిపతి కప్పముగట్టుట మానివైచి కదనమునకుఁ గాలుద్రువ్వుచుండెను. ఎప్పుడు సమయము చిక్కునా ఎప్పుడు త్రిలింగసామ్రాజ్యమును గుటుక్కున మ్రింగుదునా యని దేవ గిరిరాజు కాచుకొనియున్నాఁడు. ఇంతమందికి సమాధానము చెప్పిగదా రుద్రమ్మ మనపై దండెత్తుట!"

"ఎట్లయినను మనము జాగరూకులమై సంచరింపవలెను. గణపతిదేవుని యనంతరము కాకతీయ సింహాసనము నాక్రమింపవచ్చునని గంపెడాశతో నున్నాను. తొందరపడి నా యాశ నిరాశచేయకుము."

"నీకేనా! నాకుమాత్ర మట్టి యాశ లేదనుకొంటివా? నేనుమాత్రము కలలు గనుట లేదనుకొంటివా? కడచిన రాత్రియే నేను వజ్రసింహాసనముపైఁ గొలువుదీరి కూర్చుండి యుండినట్లును, రుద్రమదేవి నాముందు బందీకృతురాలై యున్నట్లును చక్కని స్వప్నమువచ్చినది. అర్ధరాత్రి వచ్చిన స్వప్న మసత్యము కాదందురు."

"హరిహరా! మనలో మనకు విరోధములు పనికిరావు. రాజ్యము చేజిక్కవలయునేగాని నేనైననేమి నీవయిననేమి!"

"నా యభిప్రాయము సైత మదియే సోదరా"

ఇట్లు మురారీ హరిహరులు కాకతీయసామ్రాజ్యమును గూలద్రోయుటకై కుటిలబుద్ధులై కుట్రలు సాగించుచుండిరి.

౪

గణపతి చక్రవర్తి మరణానంతరము రుద్రమదేవి "వీర రుద్రదేవుఁ"డను నామముతో విశాలాంధ్ర సామ్రాజ్యమున కధీశ్వరియై శత్రుభయంకరముగను, సమస్త జనరంజకముగను రాజ్యచక్రము నడపసాగినది. సకల సామంత మండలేశ్వరులును గణపతిదేవ చక్రవర్తియే రాజ్యమేలుచున్నట్లు తెలుగురాణియందు భక్తివిశ్వాసములు గలిగి ప్రవర్తించుచుండిరి.

దక్షిణాపథమందు మాత్ర మచ్చటచ్చట సామంతులు కొందఱు శాంతిభద్రతల కొకింత భంగము గలిగించుచుండిరి. కాంచీపురాధీశ్వరుఁడగు విజయగోపాలుఁడు కప్పము గట్టక తిరుగఁబడెను. మనుమలిదేవుఁడు, సిద్ధయదేవుఁడు మొదలగు చోళరాజులు దురాక్రమణమునకు నడుములు గట్టిరి. పల్లవ రాజగు కొప్పెరుంజంగదేవుడు కాకతీయ సామ్రాజ్యమునకు వ్యతిరేకముగ నల్లరులు సాగించెను. పాండ్యరాజులు సైత మీ విద్రోహములయందుఁ బాల్గొనిరి. మురారి హరిహర దేవులు కుట్రదారులతోఁ జేతులు కలిపిరి.

రుద్రమదేవి వీరనారీ శిరోమణి. అచంచల దీక్షా సమన్విత. అనుపమాన తేజోవిరాజిత. ఆ మహారాజ్ఞి దక్షిణమునం దేర్పడిన యీ యల్లరుల కేమాత్రమును సంచలింప లేదు. తమ ప్రాణము లర్పించియైన సామ్రాజ్య విజయ ధ్వజమును సుస్థిరము చేయఁగల మహాశౌర్య సంపన్నులైన చమూపతు లెందఱో యామె చెంతనున్నారు.

వీరాగ్రేసరు లగు నాగదేవమహారాజు, జన్నిగదేవ మహారాజు, త్రిపురారిదేవ మహారాజు మొదలైన మహా సేనానులు తెలుగురాణి యనుజ్ఞనంది విద్రోహుల గర్వ మడంచి యాంధ్రసామ్రాజ్యము నలుమూలల శాంతి నెల కొల్పిరి. కుట్రదారు లాక్రమించిన భూభాగములను మఱల జయించి యాంధ్రసామ్రాజ్యమం దైక్యమొనర్చిరి.

ఇదే సమయమున కాకతీయగణపతిదేవ చక్రవర్తి కాలమునం దాంధ్రసామ్రాజ్యమునకు సామంతుడై యున్న కటకేశ్వరుఁడు చక్రవర్తి మరణానంతరము స్వాతంత్ర్యమును

ప్రకటించి కప్పముఁగట్టుట మానివైచెను. గుద్రమదేవి యసమాన శౌర్య సాహసోపేతులైన పోతయనాయఁడు మారయనాయఁడు నను సేనానాయకులఁ బంపి కటకాధిపతి గర్వం భంగము గావించి యెప్పటియట్లు నాంధ్ర సామ్రాజ్యమునకు సామంతునిగ నొనర్చెను.

ఈ విధముగ రుద్రాంబ భద్రకాళివలె విద్రోహుల గర్వనిర్మూలనము సేయుచుండ కుటిలస్వభావులును దురాశా దుర్విదగ్ధులగు మురారి హరిహరులు తమయాట లిచట సాగ రావని గ్రహించి మెల్లఁగా దేవగిరిరాజగు మహాదేవరాజు మఱుఁగుఁజొచ్చిరి. ఏకశిలానగరముపై దండెత్తి రావలసిన దని యాయనను ప్రోత్సహించిరి. తెలుఁగురాణిని సింహాసనమునుండి దింపి తమ్ము గద్దెనెక్కించినచో బ్రతికినంతకాలము దేవగిరిరాజ్యమునకు సామంతులమై దేవర వారి యడుగులకు మడుగు లొత్తుచుఁ గప్పములు గట్టుచుందు మని ప్రార్థించిరి.

దేవగిరిరాజునకు మొదటనుండియుఁ గాకతీయసామ్రాజ్యముపైఁ గన్నెఱ్ఱగా నుండెను. ఎట్లయినను నాంధ్రసామ్రాజ్యమును ఛిన్నాభిన్న మొనర్చి దక్షిణాపథమునం దేకచ్ఛత్రాధిపత్యమును స్థాపింపవలెనని యతఁ డువ్విళ్లూరుచుండెను. వాని కోరికకుఁ దగినట్లిప్పుడు రాజ్యము గుట్టుమట్టు లెఱింగిన రాజబంధువులే మిత్రులైనారు. ఇంకఁ గావలసిన దేమున్నది! మహాదేవరాజు కాకతీయసామ్రాజ్య వినాశనమునకు మురారి హరిహరులతోఁగూడి కలలు గనుచుండెను. అసంఖ్యాకములగు సేనలను సిద్ధపఱచుకొని తగిన సమయమునకై వేచి యుండెను.

క్రమక్రమముగ కాకతీయసామ్రాజ్యమునఁ దలయెత్తిన కల్లోలములు శాంతించినవి. కళాపోషణమునకును కవితాగోష్ఠులకును వినోదవిహారములకును విద్యాప్రదర్శనములకును కవిపండితసన్మానములకును సుందరశిల్పనిర్మాణమునకును రుద్రమదేవి తన రాజ్యమున తగినంత దోహద మిచ్చినది. అద్వితీయ శివభక్తురా లగు నామె యనేక శివాలయములు నిర్మించినది. అసంఖ్యాకములగు నుద్యానవనముల పెంపొందించినది. బ్రహ్మచారులకు వివాహములు చేయించినది. వేలకొలది తటాకములు త్రవ్వించినది. అన్నసత్రములు పెట్టించినది. తన పేర వేయి రుద్రవరములను గ్రామముల నిర్మింపజేసినది. బీదసాదలను ప్రేమపూర్వకముగ నాదరించినది. ప్రజలను కన్నతల్లివలె పరిపాలించినది. ఆమె శ్వేతచ్ఛత్రముక్రింద నాంధ్రసామ్రాజ్యము వైభవోపేతమై, మహోజ్వలమై విరాజిల్లినది.

రాజనీతి విశారదయగు రుద్రమదేవి ప్రజారంజకములకు నిట్టికార్యములలో నిమగ్నురాలై యున్నను దుర్గరక్షణమునం దేమాత్ర మేమరిపాటునందలేదు. శిథిలములగు కోటగోడలు దృఢతరముగ పునర్నిర్మించినది. ఏకశిలానగరమునకుఁ జుట్టును కంపకోట గట్టించినది. దీనికి లోతట్టున మట్టికోట గట్టించినది. దీనిచుట్టును గొప్ప యగడ్త ద్రవ్వించినది. రాతికోటకు లోతట్టున శిలాసోపానముల నిర్మింపజేసినది. దుర్గము సురక్షితముగానుండు కట్టుదిట్టములన్నియు నొనర్చినది. భూమి

కోటకు గవను లెనిమిది. దిడ్లు పదునెనిమిది. పుట్టకోటకు గవనులు నాలుగు. దిడ్లెనిమిది. రాతికోటకు గవనులు నాలుగు. దిడ్లెనిమిది.

కొమ్మ కిరువురు, బురుజు కేబదిమంది, దిడ్డికి నూర్వురు గవనున కైదువందల మంది ముక్కాకలదీరిన వీరభటులు నిరంతరము కాపుందునట్లు తెలుగురాణి యేర్పాటు చేసినది. వీరాధివీరులైన కమ్మసేనానులు రెడ్డిసేనానులు వెలమసేనానులు రెప్పవేయక యహోరాత్రములు దుర్గరక్షణకై నియమింపఁబడిరి.

౬

ఒకపర్యాయము రుద్రమదేవి బంధుమిత్రసమేతముగ మ్రొక్కుబడులు దీర్చుకొనుటకై మొగలిచర్ల కేతెంచినది. అచ్చట ఏకవీరాదేవికి సహస్రనామార్చనము చేయించినది. లక్ష కుంకుమార్చనము జరిపించినది. పేదసాదలకు దానధర్మములు గావించినది. తనకు పుత్రసంతానము లేకపోవుటచే, తన పుత్రికయగు ముమ్మడమ్మకు కాకతీయ సామ్రాజ్య ధౌరేయుఁడైన కుమారు ననుగ్రహింపుమని భగవతిని భక్తి పూర్వకముగ ప్రార్థించినది.

అనంతరము రుద్రమదేవి యొక చలువరాతి మంటపమునఁ గూర్చుండి విశ్రాంతిదీసికొనుచుండ నొక యాశ్వికుఁడు రోజుకొనుచు వచ్చి మహారాజ్ఞి కొక లేఖ నందించెను. రుద్రమదేవి యా లేఖ విప్పి తనలో దా నిట్లు జదువుకొనెను.

రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీమన్మహామండలేశ్వర శ్రీ రుద్రమదేవ మహారాజులుంగారి పాదపద్మములకు ప్రణామములు! మురారి హరిహరులు సేనాసమేతులై వచ్చి మన దుర్గమును ముట్టడించినారు. వారలకు దేవగిరి ప్రభువగు మహాదేవరాజు బాసటయై వచ్చినాడు. తాము వెను వెంటనే రాజధానికి రావలెనని విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు మహామంత్రి,
శివదేవయ్య.

రుద్రమదేవి ముఖము క్రోధారుణమయ్యెను. కనుబొమలు ముడివడెను. దక్షిణహస్త మప్రయత్నముగ నోరలో నున్న కృపాణమును సంస్పృశించెను. "ఏమీ మేము నగరమున లేనిసమయమున దుర్గమును ముట్టడించినారా! ఆ పిఱికి పందలకు దేవగిరిరాజు సహాయమా! వీరికి వినాశకాలము దాపురించుటచేతనే యిట్టి విపరీతపు బుద్ధులు పుట్టినవి" అను మాటలు తెలుగురాణి నోటినుండి వెలువడినవి.

## ౭

మహారాజ్ఞి దుర్గములో లేదను విషయమును తెలిసికొని తగిన సమయము కొఱకై వేచియున్న మురారిహరిహరదేవు లపార సేనావాహినులతో నాంధ్ర సామ్రాజ్యముపై దండెత్తి వచ్చిరి. వారి దురోద్బోధలకు లోనైన మహాదేవరాజు మూడులక్షల సైన్యములతో వచ్చి ఏకశిలానగర దుర్గమును ముట్టడించెను. మహామంత్రి శివదేవయ్య దుర్గద్వారము

మూయించి రిపుసైన్యములు దుర్గపరిసరములకు రాకుండ కోటగోడపైనుండి భయంకర సమరము సాగించుచుండెను. మురారి హరిహరులును మహాదేవరాజును రుద్రమదేవి తిరిగి వచ్చినచో తమ యాటలు సాగవనియు నా సమయము మించినచో తమ ప్రయత్నమంతయు బూడిదలోఁ బోసిన పన్నీరగు ననియు నిశ్చయించి యెట్టులైనఁ గోట పట్టితీరవలయు నను గట్టి పట్టుదలతో ప్రాణములకు తెగించి పోరుచుండిరి.

ఇంతలో రుద్రమదేవి యసంఖ్యాక చమూసమూహముతో వచ్చి వెనుకనుండి శత్రుసైన్యములపైఁ బడెను. మహారాజ్ఞి వచ్చినదని తెలియుటతోడనే యాంధ్రవీరుల శౌర్యసాహసములు ద్విగుణీకృతము లయ్యెను. అపార పౌరుషముతో — అద్వితీయ పరాక్రమముతో — అఖండసాహసముతో — అనుపమాన దేశభక్తితో ఆంధ్ర వీరాగ్రేసరులు కేసరులవలె శాత్రవసైన్యములను చీల్చి వైచుచుండిరి. ఆంధ్ర సైనికుల విజృంభణమునకు హరిహర మురారి మహాదేవుల బలములు నిలువలేక పోవుచుండెను.

రుద్రమదేవి స్వయముగ సర్వసైన్యాధిపత్యమును స్వీకరించెను. భయంకర కృపాణమును ధరించి యుద్రేకముతో విద్రోహులపై దుముకుచున్న రుద్రమ మహిషాసురమర్దని వలె ప్రకాశించెను. ప్రతిపక్ష సైనికులు ప్రతిఘటనకు నిలువలేక భయోద్వేగములతో పంచబంగాళమైరి. ఆంధ్రపౌరుష ఝంఝానిలమునకు దేవగిరి సేనలు గడ్డిపోచ లయ్యెను.

ఆంధ్రుల విజయశంఖములు ప్రతిధ్వనించినవి. ఆంధ్ర జయభేరి మ్రోగినది. ఆంధ్రపతాక సగర్వముగా నభో భాగమున నర్తన మొనర్చినది. ఆంధ్ర సమ్రాజ్ఞి వినయ లక్ష్మీవిరాజిత యయినది.

౮

నాడు కాకతీయాంధ్ర సామ్రాజ్యలక్ష్మికి భద్రపీఠమైన రత్నసింహాసనముపై రుద్రమదేవి మహారాజులుంగారు సమా సీనులై యున్నారు. సభికుల ముఖపద్మములన్నియు విజయో త్సాహముచే వికసించియున్నవి. దండనాధులు సగర్వముగ నుపవిష్టులై యున్నారు. నాఁటి మహాసభకు ఆంధ్ర వీర భటులెల్లరును మహారాజుగారిచే నాహ్వానింపఁబడి వచ్చి యుండిరి.

ముందుగా మంత్రివర్యుఁడు శివదేవయ్య లేచి సభికుల నుద్దేశించి యిట్లు చెప్పఁదొడంగెను :—సభాసదులారా! ఆంధ్రమహాజనులారా! నేఁడు మన యాంధ్రసామ్రాజ్య విజయోత్సవము. ఈ శుభసమయమున మహారాజులుం గారిని గురించి యొక్కింత నుడువవలసియున్నది. ఈ మహా రాజు రుద్రమదేవియే అని మీ కెల్లరకును తెలియును. పురుష వేషముతో నిన్ని దినములనుండియు రాజ్యపరిపాలన సేయు చున్న మన తెలుగురాణి అఖండ సాహసవతి. వీరాంగన. ఈమెచేతి చలువచేతనే ఆంధ్రసామ్రాజ్యము నేటికి సురక్షిత మైనది. ప్రజాభిమానమును మిక్కుటముగఁ జూఱగొనిన మన రాణి ప్రజాభ్యుదయమునకై నెన్నియో సత్కార్యము లాచ

రించినది. పెక్కు దానశాసనములు చెక్కించినది. ఈమె ప్రజ్ఞావివేకములు, రాజ్యపాలనా చాతుర్యము సంస్తవనీయములు. ఈమె చరిత్రము ఖండఖండాంతర ఖ్యాతము.

ఇరుగో ఈ ప్రక్క బంధితులైయున్న వీ రిరువురు మురారి హరిహర దేవులు. ఆంధ్రసామ్రాజ్యమును విచ్ఛిన్నము చేయుటకై కుట్రలు పన్నిన దేశద్రోహులు.

ఇడుగో! ఈతఁడు దేవగిరిరాజు. దుర్మదాంధుఁడై దురాక్రమణ కుద్యమించి మనపై నెత్తివచ్చినాడు. తగిన ఫల మనుభవించినాఁడు. వీరికి యోగ్యమగు శిక్ష మీ సమక్షమున మహారాజ్ఞి యిప్పుడే చెప్పెదరు.

మీ రాంధ్రచక్రవర్తిని యెడఁజూపిన గౌరవాదరాభిమానములకు, ప్రేమకూ, సదాకృతజ్ఞయై శ్రీరుద్రమదేవిగారు తమ ధన్యవాదము లర్పించు కొనుచున్నారు.

సభాసదుల జయజయధ్వనులమధ్య రుద్రమదేవిలేచి యిట్లు పల్కెను.

"మహావీరులారా! అభివందనములు, మీ యందరి బాహుబలముచే మనసామ్రాజ్యము సుస్థిరమైనది. రణరంగమున మేనువాల్చిన వీరసైనికులకు మా సానుభూతి.

మురారి హరిహారులకు యావజ్జీవ కారాగారశిక్ష విధించుచున్నాము. అనంతర మవనతముఖుఁడై యున్న దేవగిరి రాజును వీక్షించి రుద్రమదేవి యిట్లనియెను.

"రాజా! చేజిక్కిన శత్రువుల కెట్టి యపకారమును చేయబోము. అది మా ఆంధ్ర వీరుల ధర్మము. నీవు దుర్బో ధలచేగాని, దురాశాపిశాచా వేశపూరితుడవై గాని, నిష్కా రణముగా మాపై నెత్తివచ్చి పరాజితుడవైతివి. నీకు లక్ష సువర్ణఖండములు అపరాధము విధించుచున్నాము. అది చెల్లించి స్వేచ్ఛగా వెడలిపొమ్ము. ఆంధ్ర సామ్రాజ్యముపై నెన్నడును దురాలోచనకుఁ గడంగకుము."

మహాదేవరాజు లక్ష సువర్ణఖండములు చెల్లించినాడు. రుద్రమదేవి వానినెల్ల స్వతంత్రసమరమున వీరవిహారము చేసిన విజయాంధ్ర భటులకు దోసిళ్ళతోఁ బంచిపెట్టినది. మరియుఁ బెక్కుబహూకృతులతో వీరులను గౌరవించినది. నాఁడు ప్రజాబాహుళ్యమును సైనికచయము సాటిలేని సంతో షముతో పొంగిపోయినది. సమాప్తమయినది.

రుద్రమదేవి వీరనారీమణి. ఆమె విజయోపాఖ్యానము భారత దేశచరిత్రలో స్వర్ణపంక్తులతో లిఖింపఁదగినది. రుద్రమ ప్రసన్నపరిపాలనము భారతమాత పాదపూజకు ప్రఫుల్ల కమలమైనది. ఆంధ్రదేశ వైభవము ఆంధ్ర మహిళ సామర్థ్యము ప్రపంచమున కెలుగెత్తి చాటిన రుద్రమదేవిని గన్న ఆంధ్రమాత ధన్యురాలు.

# స్వతంత్ర భారతము

## ౧

రాజసభామంటపము మేవాడ పౌరులందఱు పట్టాభిషేకమహోత్సవమును సందర్శించుటకై చనుదెంచియుండిరి. నిండుసభ కన్నులకుఁ బండువసేయుచుండెను.

సభామధ్యమున నొక యున్నతవేదికపై మేవాడ రాజసింహాసనము విరాజిల్లుచుండెను. సింహాసనము ముందున్న రత్నపీఠముపై మేవాడ రాజమకుటమును వీరఖడ్గమును ధగధగ మెఱయుచుండెను.

ఇంతలో నచ్చటికొక రాజకుమారుఁడు ససంభ్రమమేగ చనుదెంచెను. అస్తవ్యస్తములగు నాతని దుస్తులను వ్యత్యస్తములగు నాతని యాభరణములను గాంచి సభ్యులు నవ్వుకొనసాగిరి.

ఆ రాజనందనుఁడు సభ్యులను జూచి "నేను ఉదయసింహుని కుమారుఁడను. జగమల్లుఁడను. ఇంకను మీరు నన్ను గుర్తింపలేదా! లేచి నాకు స్వాగత మీయరేమి? నన్నుజూచి లేవరేమి?" అని యఱచెను.

సభయంతయు నీతని పలుకులకు లోలోన నవ్వుకొనసాగెను. ఎవరును మాఱుపలుకలేదు.

అతఁడు మఱియు బిగ్గఱగా "మీకు చెప్పుడా? నేను రాజకుమారుఁడను. పట్టాభిషేకమునకై వచ్చితిని. నన్నాహ్వానింపరేమి?" అని పలికెను.

"ఇక చాలు! కూర్చుండుము! కూర్చుండుము" అని సభలోనుండి కేకలు బయలుదేరెను.

"ఓహో! నన్ను కూర్చుండమనుచున్నారా? మంచిది! ఇదిగో!!" అని రాజసింహాసనముపైఁ జదికిలఁబడెను. అట్లు కూర్చుండి ముందున్న కిరీటమును దీసి తన తలపై బెట్టుకొనపోయెను.

వెంటనే 'ఆగు' మని మహాసభలోనుండి యొక కంఠ ధ్వని వినవచ్చెను. సభ్యు లందఱు ఆశ్చర్య చకితు లయిరి.

సలుంబ్రా కృష్ణసింహుఁడు నిజాసనము నుండి దిగ్గున లేచి "ఓయీ! ఇది నీ సింహాసనము గాదు. ఇది వీరాధి వీరుఁడగు ప్రతాపసింహునిది. 'రాణా' యగు నధికారము ఉదయసింహుని జ్యేష్ఠపుత్రునిదేగాని కనిష్ఠపుత్రుఁడ వగు నీదిగాదు. దిగిర" మ్మనెను.

జగమల్లుఁడు క్రోధావేశముతో "ఏమీ? మా తండ్రి ఉదయసింహుని యాజ్ఞనుసారము మీరు నడవ నవసరము లేదా? నాఁడు మరణశయ్యమీఁదఁ బరుండి నా జనకుఁడు 'నన్నుఁ బట్టాభిషిక్తుజేయు' మనిన నీవు 'చిత్త' మనలేదా? ఇప్పుడింత ద్రోహమునకుఁ బాల్పడితివా!" అని పల్కెను.

ఈ పలుకులు చెవులకు ములుకులై సోక కృష్ణవిభుఁడు దండ తాడిత భుజంగమువలె వడి మండిపడుచు "మూర్ఖుఁడా!

నేఁడో రేపో మరణించు ముసలికేల సంతాపము గలిగింపవలెనని నాఁ డంగీకరించితినిగాని వేఱుగాదు. అయినను మీ యన్న సర్వసద్గుణ సంపన్నుఁడు, మేవాడ వీరకేసరియగు ప్రతాపసింహుఁడుండ మేవాడ సింహాసనము నీకుఁ బ్రాప్తించు ననుకొంటివా? చాలు. నీతండ్రి పిఱికిపందయై 'చిత్తూరు'ను యవనుల వశ మొనర్చినాఁడు ఆ తండ్రిని మించిన తనయుఁడవు నీవు నేఁడు 'రాణా'వై రసపుత్రుల నింకను శాశ్వతదాస్యమునఁ బడి మ్రగ్గు మందువా? ఇదిగో! ఎందఱెత్తి వచ్చినను భయపడువాఁడనుగాను. ప్రతాపుని 'రాణా'ను చేసి తీరెదను. గౌరవముగా దిగిరమ్మని సింహాసనము కడ కేఁగెను.

జగమల్లుఁడు 'వృథా వాదోపవాదములతో మాకు నిమిత్తము లే' దనుచు కదలక మెదలక సింహాసనము మీఁద భీష్మించుకొని కూర్చుండెను.

కృష్ణసింహు డాగ్రహావేశము నాపుకొనలేక "ఓయీ! రాజధర్మమునకు వ్యతిరేకముగా, ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగా నీవట నుండుటకు వీలులేదని జగమల్లుని సింహాసనము నుండి బలవంతముగఁ గ్రిందకు లాగివైచెను.

సభ్యులెల్లరు సంతోషముతోఁ జప్పట్లు చఱచిరి.

జగమల్లుఁడు మేవాడపౌరుఁ డెవ్వఁడును తన పరాభవమునకుఁ జింతింపమి వెఱఁగంది సాశ్రులోచనుఁడై సభనుండి వెడలిపోయెను.

సలుంబ్రా కృష్ణ సింహాది ప్రముఖులచేఁ బ్రార్థితుఁడై ప్రతాపసింహుఁడు సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టు చుండ సభాస్థలిఁ బ్రవేశించెను. సభాసదులందఱు సమ్మోదముతో నాతనికి స్వాగత మొసంగిరి.

ప్రతాపుఁడు ప్రసన్నవదనుఁడై ప్రజాభిప్రాయానుసారము రత్నసింహాసనము నధిరోహించెను.

"మహారాణా ప్రతాపునకు జయము జయ" మని సభ్యులు పుష్పవర్షము కురిపించిరి.

పరమానంద హృదయులై మేవాడ పౌరులు తమ యదృష్టమును పొగడుకొనిరి.

సలుంబ్రా కృష్ణసింహుఁడు లేచి ప్రతాపుని తలపై బంగారు కిరీటముంచి రాజఖడ్గమును హస్తమున కందించెను.

మహారాణా ప్రతాపసింహుఁడా వీర కృపాణమును గైకొని కన్నుల కద్దుకొనెను. అనంతరము సింహాసనము నుండి లేచి తన ప్రజల నుద్దేశించి యిట్లుపలికెను.

"మేవాడు ప్రజలారా! మీకు నాయందుఁగల భక్తి విశ్వాసములకు ధన్యవాదములు. మేవాడుదేశము స్వాతంత్ర్య లక్ష్మితోఁ దులదూగవలె నన్నదే నేఁటి మన ధ్యేయము. స్వచ్ఛంద పవిత్ర జీవనమే మన యాశయము. మాతృదేశ స్వాతంత్ర్యరక్షా దీక్షతో మన భవిష్యత్తు నిర్ణయింపఁబడ గలదు. ఒక్కించుక యుపేక్ష యొనర్చినందువలననే గదా మన చిత్తూరు నేలమట్టమై పోయినది! అదే మన చిత్తూరు

దుర్గము! శిథిలమై, జీర్ణమై యెట్లున్నదో చూడుడు. రాజ ప్రాసాదములు గ్రద్దలకు గబ్బిలములకు నిలయమైనవి. నగర వీధులన్నియు బీడయి పాడయి పోయినవి. విధ్యుక్తధర్మముల నిర్వహణమే మన కర్తవ్యము. రెండు వీరకంకణములు ధరింపుడు. స్వాతంత్ర్య సమరవీరులై ముందడుగు వేయుడు. ఏనాఁడు మన చిత్తూరు పూర్వవైభవములతో విరాజిల్లునో అదే మనకు విశ్రాంతి దినము. దేశస్వాతంత్ర్య సంరక్షణార్థము సర్వస్వము త్యాగ మొనర్ప సంసిద్ధముకండు! చిత్తూరు స్వాతంత్ర్యమును సంపాదించువఱకు రసపుత్రవీరు లెవ్వరును తల్పములమీఁద శయనింపరాదు. పంచభక్ష్య పరమాన్నము లారగింపరాదు. ఇదే మన ప్రతిజ్ఞ! ఇదే మన జీవితలక్ష్యము!!"

రాణా మాటలు విని రసపుత్రవీరులందరు తమతమ ఖడ్గములపైఁ జేతులువైచి ప్రమాణములు స్వీకరించిరి. జయ జయ నినాదములతో నాఁటిసభ ముగిసెను.

౨

ఆనాఁడు రాజపుత్రులకు పర్వదినము. రసపుత్రవీరు లందఱు వేటాడుటకై యరణ్యమున కరుదెంచిరి. మృగయా కోలాహలముతో మహారణ్యము మాఱుమ్రోగుచుండెను.

మహారాణా ప్రతాపసింహుఁడు కార్ముకము నెక్కు-వెట్టి యొక వనవరాహము వెంటబడెను. చిట్టచివరకు గుఱి చూచి బాణము విడిచెను. అలుగు సూటిగా వచ్చి అడవి పంది డొక్క-లో గ్రుచ్చుకొనెను.

ఇంతలో మఱియొక దెసనుండి వేఱొక బాణమువచ్చి యా సూరకమునకుఁ దగిలెను. తోడనే యా వరాహము గిరగిరఁ దిరిగి నేలఁబడి యుసురులు వాసెను.

ప్రతాపసింహుఁడు దానిసిఁ దీసికొనిపొమ్మని సేవకున కాజ్ఞాపించెను.

ఇంతలో నొక వీరుఁ డేతెంచి "దాని నెవ్వరు ముట్ట రాదు. అది నా శరాఘాతముచే మరణించినది కాన దానిపై నధికారము నాది" యనెను.

ప్రతాపుఁడు విస్మితుఁడై "ఏమి! శక్తసింహా! దానిని నీవు చంపితివా? ఇంత స్వల్పవిషయమునను నసత్యమాడెద వేల? దానికి నా బాణమే మొదట తగిలినది. ఇంతటి స్వార్థమా" యనెను.

"స్వార్థము—స్వార్థ మనియెదవు! స్వార్థబుద్ధి యెవరికి లేదు? నీవు స్వార్థ బుద్ధితోనేగదా మేవాడు రాజ్యమెల్ల నాక్రమించినది!"

శక్తసింహుని యీ మాటలు విని ప్రతాపుఁ డుద్రిక్తు డాయెను.

"శక్తసింహా! 'మహారాణా'ను తూలనాడిన శిక్షాప్రా డ వగుదువు."

ప్రతాపసింహా! నన్ను శిక్షించుటకు నీకేమి యధి కారము గలదు? పలుమాటలేల? చేతనయిన నాతో యుద్ధ మొనర్చి—నన్ను జయించి—వరాహమును గొనిపొమ్ము!

ఈ మాటలు వినఁగానే ప్రతాపుఁడు ఒరనుండి కత్తి దూసి ముందునకు దుమికెను.

సోదరు లిరువురు భయంకర సంగ్రామమునకు సన్నద్ధులై నడుములు బిగించి ముందున కురికిరి.

రాజపురోహితుఁడు 'హారభట్టారకుఁ' డీ యన్నదమ్ముల యంతఃకలహమును జూచి "నాయనలారా! శాంతింపుఁడు! శాంతింపుఁడు! సోదరులలో వివాదములు దేశానర్థకములు.' అని ప్రతాపశక్తసింహుల వారింపఁబోయెను; కాని అతని హితోక్తులు వారి చెవి కెక్కలేదు.

ఇంతలో 'హా! మహారాణా!' అను కంఠధ్వని విన వచ్చెను.

ప్రతాపశక్తసింహులు నిశ్చేష్టు లయిరి.

హారభట్టారకుఁడు ఖడ్గముతో వక్షస్థలమునఁ బొడుచుకొని వా రిరువురిమధ్య పడిపోయెను. అచ్చటి భూభాగ మంతయు రక్తసిక్తమై పోయెను.

ప్రతాపశక్తసింహులు హారభట్టారకుని సమీపించి "పూజ్యగురూ! మమ్ము క్షమింపు" మని ప్రార్థించిరి.

హారభట్టారకుఁడు కనులు తెఱచి "వత్సలారా! నా కొఱకు పశ్చాత్తాప పడకుఁడు. నా రక్తముతో మీ విద్వేషానలము శాంతించి యుండవచ్చును. మీలో నైకమత్యము నెలకొల్పఁ దలంచియే నే నాత్మార్పణము గావించితిని" అనుచుండఁగనే ఆతని ప్రాణపతంగము దేహపంజరము నుండి యెగసి పోయెను.

బ్రహ్మహత్య—గురుహత్య జరిగిపోయినది.

ప్రతాపసింహుడు క్రోధావేశము నాపుకొనలేక "ఛీ! శక్తసింహా! నీ మూలముగా గురుదేవులను గోల్పోయితిని. నీకు రాజదండనము తప్పదు. నీకు దేశభ్రష్టత శిక్షగా నిర్ణయించినాము. ఇదే మా యాజ్ఞ. ఇటనుండియే నీవు దేశాంతరమునకుఁ బొమ్ము" అని పల్కెను.

శక్తసింహుఁడు చేయునదిలేక పండ్లు పటపట గొఱుకుచు నటనుండి వెడలిపోయెను. ప్రతాపసింహుఁడు భట్టారకుని శరీరమున కంత్యక్రియలు జరిపించెను.

## 3

ప్రతాపసింహుఁ డొకనాటి సాయంకాలము మంత్రులతోఁగూడి మంత్రాలోచన మొనరించుచుండెను. పదిపదునైదేండ్ల ప్రాయముగల ప్రతాపుని కుమార్తె భారతి వీరగీతులాలపించుచు విలువిద్య నభ్యసించుచుండెను. ఇంతలో నొక చారుఁ డరుదెంచి ప్రతాపునకు నమస్కరించి యిట్లు పల్కెను.

"మహాప్రభూ! అత్యంతావశ్యకములగు విషయములు కొన్ని తెలియ వచ్చినవి. సావధానముగా వినుఁడు. మొన్న తమ యాజ్ఞానుసారము దేశభ్రష్టుడైన శక్తసింహుఁడు ఢిల్లీశ్వరుని గలిసికొనెనఁట!"

"ఏమీ! శక్తసింహుని వీరత్వము! దేశద్రోహమునకుఁ బాల్పడియెనా?"

"అవును; ప్రభూ! అక్బరును దర్శించి మ్రొక్కి తనకుఁ గొలువుకూటమున నొక యున్నతోద్యోగ మిచ్చి గౌరవింప వలసినదని కోరెనఁట."

"ఇంకేమి—అక్బరు మందహాస మొనర్చి గౌరవించి యుండవచ్చును."

"శక్తసింహుఁ డొక యున్నత సైనికాధికారిగా నియమింపఁ బడినాఁడఁట. ఇఁక నక్బరు తన రాజనీతిజ్ఞత నుపయోగించి శక్తసింహుని మనపై ప్రయోగింప వచ్చునని చూచాయగాఁ దెలియవచ్చినది."

"శక్తుడు రాజపుత్రుడయ్యును ఎంత ఘోరకృత్యమునకుఁ దలపెట్టినాఁడు? ద్రోహి!"

ప్రతాపసింహుడు దీర్ఘాలోచనా నిమగ్నుడయ్యెను.

ఇంతలో మహారాణా కుమారుఁడు 'అమరసింహుఁడు' సంభ్రమముతోఁ జనుదెంచెను. ప్రతాపుఁడులికిపడి వానిని జూచి యిట్లనెను.

"ఏమి! అమరసింహా! మనలఁ జూడ నేతెంచిన 'మానసింహున'కుఁ దగు మర్యాద లొనరించితివా?"

"తండ్రీ! మీ యానతి ననుసరించి 'మానసింహున'కు విందు నేర్పాటు గావించితిని. అతఁడు 'విందుఁగుడువ మీ తండ్రి రా లేదే'మని యడుఁగ నేనందులకు "తమరు ఢిల్లీశ్వరుల ముద్దుల బావమరదులు. ఇక మా తండ్రి ప్రతాపసింహుఁడు సామాన్యరాజు. గౌరవనీయులగు తమ సహాపంక్తి ని

గూర్చుండి విందారగించునర్వాత మా నాన్నగారికి లే" దని ప్రత్యుత్తర మిచ్చితిని. అందుల కాతఁడు మండిపడి కూర్చున్న చోటనుండిలేచి "మీతండ్రి గొప్పదనము చూచెదగాక-సిద్ధముగా నుండు"మని-యింకేమేమో ప్రేలుచు వెడలిపోయెను."

"ఔరా! మానసింహు డెంత ఘనుఁడైనాఁడు. సిగ్గువదలి మొగలు భూపతులతో సంబంధములు చేసికొనినది చాలక మాకు పిటికిమందు పోయునంతటివాఁడా"యని ప్రతాపుఁడు తలపంకించుచున్నంతలో నొక వార్తాహరుఁ డరుదెంచి "మహాప్రభూ! అఖండ సేనాసమేతుఁడై శక్తసింహుఁడు మనపై దండెత్తి వచ్చుచున్నాఁడు"అని పల్కెను.

ప్రతాపసింహుఁ డొక నిట్టూర్పు పుచ్చి 'యనుకొనినంత యయినది. కడకు మహారాణా సోదరుఁడే మాతృభూమిని నాశనము గావింపఁదలఁచినాఁ'డని యనుచుండఁగనే 'భారతి' తండ్రి మాటల కడ్డువచ్చి 'ఏమిటి నాన్నగారు! మీ సోదరుఁడేమి—మీపై దండెత్తుటేమి?' యనెను.

"అమ్మా! వాఁడు నా సోదరుఁడే. జీర్ణమైపోవుచున్న చిత్తూరు స్వాతంత్ర్యలక్ష్మిని—కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్న మేవాడ దేశమాతను చూడలేని యంధుఁడు. నా సోదరుఁడే! మీ పినతండ్రి శక్తసింహుఁడు సేనాసమేతుఁడై మేవాడపై దండెత్తి వచ్చుచున్నాఁడట"

"అదేమిటి నాన్నగారూ! కన్నతల్లిపై కత్తిగట్టా! పినతండ్రిగారి కీమాత్రము తెలివిలేకపోయెనా!"

అని భారతి పల్కుచుండ తల్లి పాటేశ్వరీదేవి "అమ్మా! నీకును రాజకీయములేనా! రమ్ము రొట్టెసిద్ధమైనది" అని పుత్రికను లోనికిఁ గొనిపోయెను.

ప్రతాపసింహుఁడు కర్తవ్యము నాలోచింపసాగెను.

౪

అది కాళరాత్రి. యవన సైనికుల పటకుటీరములలో దీపములు మినుకు మినుకు మనుచుండెను. సైనికు లందఱును గాఢనిద్ర పరవశులై యుండిరి. శక్తసింహునకు మాత్రము నిదురపట్టలేదు. అతని హృదయ మంతయు వ్యాకులముగా నుండెను. ఇంతలో నతనికొక పాట వినిపించెను. అతడు గుడారము ద్వారమువద్దకువచ్చి చూచెను. శక్తసింహున కనతి దూరమున పదునాలుగేండ్ల బాలపకీరొకడు కాన్పించెను.

'నీ వెవరవు? ఇచట కెందుల కేతెంచితి' వని శక్తసింహుఁ డతనిని బ్రశ్నించెను.

అంత బాలపకీరు నవ్వుచు శక్తసింహుని సమీపించి 'నీతో మాట్లాడి పోఁదలఁచి వచ్చితి' ననెను.

'నాతో నీ కేమిపని?' యని శక్తసింహుఁడు సగర్వముగా మరల బ్రశ్నించెను.

పకీరు తన మాయగడ్డమును దీసివేసెను. దొంగ దుస్తులు తొలగించెను. చిరునవ్వు నవ్వుచు నిలబడెను.

"ఆఁ! ఏమీ! భారతీ! నీవేల వచ్చితివమ్మా? ఈ వేష మేమిఁ?"

భారతి శక్తసింహున కభివాదన మొనర్చి యుచ్చై స్స్వరమున మాటాడఁ దొడఁగెను.

"నాయనా! మిమ్ముఁ బ్రతిబంధములు లేకుండఁ గలిసి కొనఁ దలంచి యీవేషముతో నేతెంచితిని సరే. మీ రిప్పు డిచట కెందులకు వచ్చితిరి?"

"యుద్ధమునకు"

"యుద్ధమునకా! అమ్మో! ఇవి యన్నియు నెవరి సైన్యములు?"

"మొగలు చక్రవర్తివి"

"చక్రవర్తివి! ఎవరితో నీ యుద్ధము?"

"ప్రతాపసింహునితో"

"నీ కతఁడు సోదరుఁడు కాఁడా? నాయనా! నీ జన్మ భూమి యేది?"

"నా జన్మభూమియా! మే... వా... డు"

శక్తసింహుని కంఠము గద్గద మయ్యెను. కన్నులు చెమ్మగిల్లెను. శరీరమంతయు కంపితమయ్యెను.

"తండ్రీ! ఇప్పుడు నీవు చేయఁబోవు యుద్ధము నీ మాతృభూమిమీఁద నేనా? ఇంత యత్యాచారమా? నీ శౌర్య ధైర్యములను మాతృదేశ వినాశనార్థము వినియోగింపఁ దలం చితివా? నీ చేతితో నీ దేశమాతకు దాస్యబంధములఁ దగిలింప నుంటివా? మేవాడు రాజ్య మిప్పటికే యరణ్యమై పోయినదే! చిత్తూరు కోట శిథిలమై పోయినదే! ఇంకను వానిని నాశ

రూపములు లేకుండ నాశనము చేయదలంచితివా? ప్రతాప సింహునిపై బగయున్న మేవాడు స్వాతంత్ర్యము-రాజపుత్రుల గౌరవమును గంగలోఁ గలిపెదవా? 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యను నభియుక్తోక్తిని విస్మరించితివా? 'శిశోదియా' వంశగౌరవమునకుఁ దిలోదకము లిచ్చెదవా? అష్టకష్టము లనుభవించుచు నీ రాజపుత్రులు స్వాతంత్ర్యమును ఆత్మగౌరవమును గోలుపోయి జీవచ్ఛవముల వలె నుండ నీకు సంతుష్టి గలుఁగునా? నీకు శాంతి లభించునా? తమ సర్వస్వమును ద్యాగమొనర్చి నేఁటి వఱకు మేవాడు స్వాతంత్ర్యమును రక్షించిన మనపూర్వుల నొకసారి స్మరింపుము. వారు తమ రక్తమును ధారవోసి మాతృభూమిని గాపాడినారే! నీవు నేఁడిట్లు బుద్ధిచెడి 'మాతృదేశము'నకు ద్రోహమొనరింప నెంచితివా? విశాల హృదయముతో నొకసారి సర్వవిషయముల యోచించి విధ్యుక్తధర్మములు నిర్వహింపుము. ఇఁక నేఁ బోయి వచ్చెద. నాకు సెలవిమ్ము" అని పలికి భారతి బయలుదేరెను.

శక్తసింహుఁ డా ప్రసంగము విని నిర్విణ్ణుఁడై ప్రత్యుత్తర మొసంగలేక అట్లే నిలబడిపోయెను. భారతి పినతండ్రికి నమస్కరించి మరల పకీరు వేషము ధరించి వెడలిపోయెను.

శక్తసింహుని గంభీర మానసమున నెన్నియో భావ తరంగము లొక్కుమ్మడి విజృంభించెను. వెంటనే యాతని కనులు మూతవడెను. ఆతని కనులముందు మేవాడు దేశ

మాత రక్తసిక్త శరీరముతో విలపించుచు దీనవదనయై తూలి పోవుచున్నట్లు—మేవాడు ప్రజలెల్లరు తన్ను దూషించి దుమ్మెత్తిపోయుచున్నట్లు తోఁచెను.

అంత శక్తసింహుఁడు చింతాక్రాంతుఁడై కూలఁబడి పోయెను.

౫

అది యొక కనుమ ప్రక్కనున్న కొండకాలువ. కాలువ యొడ్డున ప్రతాపుఁడు తన యశ్వముపై మూర్ఛితుఁడై పడి యుండెను. దూరమున సైనిక కోలాహలము వినవచ్చు చుండెను.

కొంతసేపటికి ప్రతాపసింహుఁడు కనులు దెఱచెను. తన ముందు ప్రాణములు బాసి పడియున్న చేతకాశ్వ మాయ నకుఁ గన్పించెను. ప్రతాపునకు దుఃఖమాగలేదు. "అయ్యో! చేతకమా! ఈ కొండకాల్వ దుమికి నా ప్రాణములు గాపాడి నీవు మరణించితివా! ఎంతగా కళ్లెము బిగించినను వినక నేడు రణరంగము వీడి యిట్లు వచ్చితివేమి! హయరాజమా! అనేక యుద్ధములలో నాకు విజయము చేకూర్చి నా ప్రాణ రక్షణము గావించితివిగదా! స్వాతంత్ర్యరక్షణార్థము రాజపుత్రవీరులే గాక వారి యశ్వములుగూడ ప్రాణముల నర్పించు నన్న కీర్తి సంపాదించితివి. ఎవరో 'ఆగుము-ఆగు' మని వచ్చు చున్నారే! చేతకమా! రాణా ప్రతాపుఁడు వెన్నిచ్చి రణ రంగము నుండి పాఱిపోవుచున్నాఁడని వైరి సేనలు తలఁచు

చున్నవా? నన్నిట కేలఁ దెచ్చితివి? సంగర రంగమున నిజు పురము సంతోషముగాఁ బ్రాణత్యాగ మొనరించి యుందుమే- అయిపోయినది. సర్వనాశన మయిపోయినది. హా! రసపుత్ర వీరులారా! కర్మభూమికై కర్తవ్య నిర్వహణ మొనరించుచు వీర స్వర్గ మలంకరించితిరా?"

అని ప్రతాపుఁడు గుఱ్ఱముపై తలవాన్చు నంతలో నిరువురు వీరులు కత్తులెత్తి ప్రతాపునిపై దుముకపోయిరి.

సరిగా నదే క్షణములో వెనుకనుండి మఱియొక వీరు డరుదెంచి యాయిరువురు వీరుల కత్తులు తుత్తునియ లొనర్చి వారి శిరము లెగురగొట్టెను. ప్రతాపుఁడు కనులు దెఱచి చూచెను. ఎదుట కత్తిదూసి శక్తసింహుడు నిలచి యుండెను. ప్రతాపసింహుఁడు విస్మితుఁడయ్యెను.

"సోదరా! వచ్చితివా? ఇఁకఁ బ్రతీకారము చేసి కొనుము. నేను పూర్వపు ప్రతాపుఁడను గాను—సైన్యము నంతయుఁ గోల్పోయి నిస్సహాయుఁడనై యున్న ప్రతాపుఁడను. శరీరము రక్తసిక్తమయినది. గాయములు బాధించుచున్నవి. కానిమ్ము సోదరా! ఒక్క-పోటున నన్నీ లోకమునుండి దూరము సేయుము. నీవు నా సోదరుఁడవయి నందులకు నా కోరిక నెర వేర్పుము—"నన్నుఁ బంధితు నొనర్పకుము. 'మహారాణా' మొగలు చక్రవర్తిముందు వినమ్రుడై యుండఁజాలఁడు." ఇదియే నా యభ్యర్థనము. మన్నింపుము." ప్రతాపుఁ డిట్లు పలికినంతనే శక్తసింహుని నేత్రముల నుండి యశ్రు బిందువులు జలజల రాలఁ జొచ్చెను.

అంత శక్తసింహుఁడు గద్గద కంఠముతో 'అన్నా! క్షమింపుము. నేను ప్రతీకారము సేయఁదలఁచి రాలేదు. ఇరుగో! ఈ మొగలు వీరు లిరువురు మిమ్ముఁ జంప నుంకించు చున్నయెడ వారి యుక్కడఁగించితిని. నావంటి ద్రోహి—వంచకుఁడు వేఱొకఁ డుండఁబోఁడు. అన్నా! కష్టసమయమునఁగూడ నీ స్వాతంత్ర్యదీక్షను శ్లాఘనీయముగఁ బ్రకటింపఁ జేసితివి. మీ రాదర్శపురుషులు—భారత వీర కేసరులు, నేను "మాతృదేశము" మీఁద నెత్తివచ్చిన క్షుద్రుఁడను. నన్ను క్షమింపుఁ' డనుచు ప్రతాపసింహుని పాదములపైఁ బడెను.

ప్రతాపుఁడు సోదరుని లేవఁదీసెను. అన్నదమ్ము లిరువురు నానందబాష్పములతో నాలింగన మొనర్చుకొనిరి. ఆ గాఢాశ్లేషములో నా సోదరుల హృదయము లైక్యమయ్యెను.

## ౬

అది మొగలు చక్రవర్తి 'అక్బరు' కొలువుకూటము. అక్బరు సార్వభౌముఁడు సింహాసనము నధిరోహించియుండెను. మంత్రులు—సామంతులు—సరదారులు—రాజపుత్రవీరులు సభ నలంకరించియుండిరి. మహాకవి 'పృథ్వీసింహుఁ' డొకయాసనముపైఁ గూర్చుండి యుండెను.

ఇంతలో నొక ద్వారపాలకుఁ డఱుదెంచి 'మహాప్రభూ! మహారాణా ప్రతాపసింహుని దూత యొకఁడు ద్వారముకడ వేచియున్నాఁ' డనెను.

'ఏమి! ప్రతాపుని దూతయా? ప్రతాపుఁడు దూత నంపినాఁడా? మహారాణా ప్రతాపుఁడే!' యను వాక్యములతో సభ యంతయుఁ బ్రతిధ్వనించెను.

చక్రవర్తి యత్యాశ్చర్యము నందెను.

రాజపుత్ర సరదారు లొకరి మొగ మొకరు చూచుకొనిరి.

సార్వభౌముని యాజ్ఞానుసారము రాజపుత్రదూత నుచిత గౌరవముతోఁ బ్రవేశపెట్టిరి.

'సార్వభౌమా! ఇదిగో ప్రతాపుని లేఖ' యని యా దూత దానిని చక్రవర్తి కిచ్చెను.

'మహాకవీ! పృథ్వీసింహా! ఈ లేఖఁ జదువు' మని యక్బరు సార్వభౌముఁడు దానిని పృథ్వీసింహున కిచ్చెను.

పృథ్వీసింహున కొడలెల్ల జెమ్మటలు గ్రమ్మెను.

ఆతఁడు లేఖ నందుకొని యిట్లు చదివెను. 'అక్బరు సార్వభౌమా! నేను నే చక్రవర్తిత్వమున కంగీకరించితిని. ఆఱు మాసములు విశ్రాంతి నీయఁ బ్రార్థన?'

విచార మగ్నుఁడైన పృథ్వీసింహుఁడు గుండె బిగఁబట్టుకొని కొంతవడి యోచించెను. ఆతఁడు 'అక్బరు చక్రవర్తిని గొల్చుచుండెనేగాని ప్రతాపునియెడ గాఢాభిమానము గలవాఁడు. ఆతని కేదో యూహ స్ఫురించెను. తోడనే వంచుకొనివ తల నెత్తెను. అక్బరు సార్వభౌముఁడు ప్రస

న్నుఁడై యుండెను. సార్వభౌముని నోటినుండి యొకమాట లూడిపడెను.

"ప్రతాపసింహా! ఈ నాటికి మా చక్రవర్తి నామ మన్వర్థమైనది."

"పొరబాటు. ఢిల్లీశ్వరా! ఇది మహారాణా ప్రతాపుని స్వహస్త లిఖితము గాదు. ప్రతాపుఁ డెన్నడును పరులకుఁ బాదాక్రాంతుఁడు గాడు-కాలేఁడు-కాఁబోఁడు" అని పృథ్వీ సింహుఁ డనెను.

"కవిరాజా! ఏమంటివి? ప్రతాపుని దూత—ప్రతాపుని లేఖ—నిస్సందేహముగా నాతనిదే."

"కాదు ప్రభూ! దీనిని శత్రువు లెవరో సృష్టించినారు. ఇది నిస్సంశయముగా వంచన. దీనినిఁ బ్రతాపుఁడు లిఖింప లేదు."

"సత్యమా? కవీంద్రా!" యనుచు నక్బరు వెలవెలఁ బోయెను.

చక్రవర్తి యాదేశానుసారము నాటికి సభ ముగింపఁ బడెను; కాని పృథ్వీసింహుఁడు మాత్రము కదలలేదు. అతని నోటినుండి యప్రయత్నముగా నీ మాటలు వెలువడెను.

"హా! మహారాణా! ఎంత పనిఁ జేయఁ దలంచితివి? ఏకైక స్వతంత్ర భారత వీరకేసరివి. నీవుగూడ అక్బరునకు 'దాసోఽహం' మన నెంచితివా? మాతృదేశ గౌరవమును విస్మరించితివా?"

# ౭

ఆరావళీ పర్వత ప్రాంతారణ్యములో మహారాణా ప్రతాపసింహుఁడు మంత్రి సామంతాద్యనుచర వర్గముతో సమావేశమై యుండెను.

అంతలో నొక రాజభటుఁ డేతెంచి యతనికి వందన మాచరించి 'మహారాణా! ఇదిగో! మహాకవి పృథ్వీసింహుఁడు తమ కీ లేఖ నందఁజేయ నానతి యొసంగినాఁ'డని యొక లేఖ నిచ్చెను.

ప్రతాపుఁడు లేఖఁ దెఱచి యిట్లు చదివెను.

"మహారాణా ప్రతాపసింహునకు నమస్సులు. వైరి గజసింహా! ప్రతాపసింహా! భారత భాగ్యవిధాతా! నీవు సత్య ధర్మ పరాయణుఁడవు - స్వాతంత్ర్య దేవతవు - కర్తవ్యదీక్షా దక్షుఁడవు - దిగంత విశ్రాంత యశస్కుఁడవు. భారతస్వాతంత్ర్యవైభవము నీచేతుల యందున్నది. నిన్నుఁ జూచుకొని నీ స్వేచ్ఛాజీవిత యాత్రలఁ దలంచుకొని మేము తలలెత్తుకొని తిరుగఁ గలుగు చున్నాము. మే మెల్లినను భ్రష్టులమైపోయి నాము; కాని మారాజపుత్రుఁడు సర్వ సర్వంసహా భర్తను సరకుగొనక స్వతంత్రుఁడై యుండెననిన మా కదే యఖండ గౌరవముగా నున్నది. మా కదే యవ్యయానందముగా నున్నది. భారతభూమి కాశా

జ్యోతులగు మీరు మొగలు చక్రవర్తితో సంధిఁ జేసికొన నెంచిరను విషయమును వినిన మమ్మే మేము విశ్వసింపలేకున్నాము. అద్వితీయ బాహుబలశాలివై - అకుంఠిత దేశభక్త్యావేశుడవై - ఆత్మగౌరవ రక్షాదక్షుఁడవైన నీవు పరదాస్యమున కంగీకృతిఁ బ్రకటించుచున్నావా? మహారాణా! నశించిపోయిన స్వాతంత్ర్య బీజములఁ దిరిగి మా మనఃక్షేత్రములయందు మొలకలెత్తింపజేయు మహానాయకుడవు నీ వొక్కడవేయని నమ్మియుంటిమే. ఇంతఁ దనుక ప్రచండ మార్తాండ తేజుఁడవై మాతృదేశమును రక్షించితివే. నేఁ డేల భారతదేశమును పాపపంకమునఁ ద్రోయఁ బూనితివి? మహారాణా! నీ వొక్కఁడవే 'స్వతంత్ర భారత స్థాపకుఁ'డవు. దౌర్బల్యము - అపజయము - ఒకొక్కప్పుడు హృదయము నాక్రమింపవచ్చును. అంత మాత్రము చేతనే కిం కర్తవ్యతా విమూఢుఁడవై పోవుట న్యాయమా? అపజయము విజయమునకు సోపానమువంటిది. ధైర్యము వహింపుము! ఉజ్జ్వల స్వతంత్రభావముల హృదయమున నిల్పుకొని దేశ గౌరవమును నిలఁబెట్టుము. ముందంజ వేయుము. 'విజయశ్రీ' వరించు సమయము మించిపోలేదు. లెమ్ము. వీరభారత స్వతంత్ర యోధుఁడవై విజృం

భింపుము. నీ ధీరోదాత్తత్వమును లోకమున కెఱుకఁ బఱపుము. వీర శిరోమణీ! విజయీభవ!

ఇట్లు
విశ్వాసపాత్రుడు
"పృథ్వీసింహుడు"

రాణాప్రతాపుఁ డుత్తేజితుఁ డయ్యెను. అయోమయ స్థితిలోఁ జేసిన దానికిఁ బశ్చాత్తాపపడెను.

"సలుంబ్రాధీశా! ఇంతకు మనము తిరిగి బలముల సమ కూర్చుటకుఁ దగు ధనము గావలెనుగదా! అది యెచటనుండి వచ్చును" అని మంత్రినిఁ బ్రశ్నించెను.

ఆయేడు—మేవాడు దేశస్వాతంత్ర్యోత్సవములఁ దిల కింప వచ్చిన 'భామాసాహి' చివ్వన లేచి "మహారాణా! ధన మున కేమి! ఇప్పుడే మీకుఁ గావలసినన్ని లక్షల సువర్ణ ఖండములఁ గైకొనుఁడు. పంపుదును. మీరు యథేచ్ఛగా వినియోగించుకొని 'మాతృదేశ' గౌరవమును రక్షింపుఁ" డనెను.

సభలో 'మహారాణా ప్రతాపునకు జై'-'మేవాడు దేశమాతకు జై' యను జయ జయ ధ్వనులు చెలరేగెను.

౮

'భారతీ! భారతీ!'

అన్నా! అన్నా!

అమరసింహుని పిలుపు విని భారతి పరువెత్తుకొని వచ్చెను.

'భారతీ! నేఁడు 'స్వాతంత్ర్య దినోత్సవము' మన రాజపుత్రసైనికులు నాయనగారి యాధిపత్యమున సప్రతిహతముగా పురోగమించి, మిగిలిన యెనుబదిమూఁడు దుర్గములను స్వాధీన పఱచుకొనినారు. అక్బరు చేయునదిలేక నాయనగారితో సంధి చేసుకొనినాడు. రమ్ము మేవాడు రాజసభకు పోవుదమని అమరసింహుఁడు, కుమారి భారతిని వెంటఁబెట్టుకొని సభాస్థలి కరిగెను.

అచట విజయ దుందుభులు మ్రోగుచుండెను. పుష్ప వర్షము కురియుచుండెను.

ఆనంద డోలికలలో నుఱ్ఱూతలూగుచు రాజపుత్రులందఱు 'భారత స్వాతంత్ర్యోద్యమము'ను గనుల పండువుగాఁ దిలకించుచుండిరి.

'మహారాణా ప్రతాపసింహునకు జై' యను జయ జయ నినాదములు మిన్నంటెను.

ఆ స్వతంత్రభాను దీప్తులే నేఁటి మన 'స్వతంత్ర భారతమునకు మహోత్తేజ 'కరములు — సంతోష సంధాయకములు.'

'నమస్తే. భారతమాతా!' యనుచు కుమారి భారతి సంతోషాతిశయముతో గంతులు వైచెను.

# ఆదర్శ భారతము

## ౧

ఆ కొట్లాట యెప్పటినుండి జరుగుచున్నదో! బాలురందఱు పూర్తిగ నలసిపోయినారు. కాని వారి యుత్సాహము మాత్రము తగ్గలేదు. ఆ సింహద్వారముకడ బయటనుండి కొందఱు—లోనుండి కొందఱు ద్వార రక్షణ సేయుచుండిరి.

బయటనుండి పోరుచున్న దళ మొక్కుమ్మడి సింహద్వారము నొక్క త్రోపు త్రోసిరి. ఆ దెబ్బతో నది తెఱచుకొనెను. లోనుండి రక్షించుచున్న వారిలోఁ గొందఱు క్రిందఁబడిరి. 'కోట చిక్కినది; లోనికిఁ బొం' డని కేక వినఁబడినది. అందఱు లోనికి నెట్టుకొని పోయిరి. ఇంతలో 'శివాజీకి జై' అను నినాదము బయలుదేరినది.

అది యొక కోలాహలము. ఆ కోలాహలములోఁ బట్టాభిషేకము. అయి దాఱేండ్ల పాల బుగ్గల పసిబాలు నొక యరుగుపై కూర్చుండఁ బెట్టిరి. ఆతని కిరువైపుల భటులు నిలిచిరి. ఒక బాలుఁడు—రాజగురువఁట—ఆతని చిన్నారి మోముపై తిలక మద్ది, అట్ట కిరీటము తలపై నుంచి చప్పట్లు కొట్టినాఁడు.

తరువాత కోటలోఁ జిక్కిన బందీల నొక్కొక్కరినే మహారాజుగారి యెదుటకుఁ గొనివచ్చిరి. మహారాజుగారు

విచారించి 'దోషుల శిక్షించి, నిర్దోషులను విడిపించుఁ' డనెను.

ఇంతలో 'శివా' యను పిలుపు వినఁబడెను. సభ యంతయు స్తంభించెను. అందఱి దృష్టు లటు ప్రసరించినవి. రాజుగారు సయితము తాను 'మహారాజు'నను మాట మఱచి 'అమ్మా' యని యరుగు దిగి పరుగెత్తిపోయెను.

జీజాబాయి పూజాపాత్ర ధరించి భవానీ మందిరమున కేఁగుటకై గృహాంతర్భాగము నుండి వెలుపలకు వచ్చెను. ఆ కన్నతల్లి తన చిన్నారికొమరు నెత్తుకొని, ముద్దాడి 'ఏమి నాయనా! ఆడుచున్నా'రని ప్రశ్నించెను. బాలశివుఁడు జిలిబిలి పలుకులతో "యుద్ధాల ఆటమ్మా! మేము కోటను బట్టుకొన్నా" మనెను. 'కోట యేది నాయనా!' యని తల్లి ప్రశ్నించెను. బాలుఁడు 'ఉత్తుత్తి ఆటేనమ్మా! మన యిల్లే కోట' యనెను.

ఆ పలుకులలో నామె కేదో యఖండమగు నానందము గోచరించెను. నేఁడు విజయదశమి. భవానీమాత నర్చించి వత్తము రమ్మని జీజాబాయి బాలశివుని వెంటఁ బెట్టుకొని దేవీ మందిరమున కరిగెను.

ఉత్సవకోలాహలములో నాలయమంతయు నిసుక వేసిన రాల నట్లుండెను. భవానీదేవి విజయాలంకార విరాజమానయై దర్శకుల కొక వింత యుత్సాహ ముదయింపఁ జేయుచుండెను. ఫాలి భాగమున మణిమయ కిరీటము - ఒకచేత ఖడ్గము - ఒకచేత డాలు - ఇంకొక చేతిలోఁ

జక్రము - వేఱొక చేతిలోఁ ద్రిశూలము నొఱయుచుండెను. ఇట్లాయుధపాణియై సింహవాహనారూఢయైయున్న భవానీ మూర్తి భీరువులకు భయము - ధీరులకు స్థైర్యము గలిగించు చుండెను.

వీరమాత జీజాబాయి భక్తిశ్రద్ధలతో దేవి నర్చించి, బాలశివుని దేవి పాదములపైఁ బడవైచి యిట్లు ప్రార్థించెను. "జగజ్జననీ! భువనపావనీ! భవానీ! నీ వరప్రసాదమగు నీ బాలు నెట్లనుగ్రహింతువో? భర్తృ పరిత్యక్తనై పడరాని యిడుమలఁ బడుచు నీ నిసుఁగును బెంచుచుంటిని. నలుమూలల నధర్మము తాండవ మాడుచున్నది. పూతలగు గోమాతలకు సయితము జీవితము దుర్భర మగుచుండెను. రాజుల నిరంకుశత్వమునకుఁ బ్రజలు బలి యగుచున్నారు. తల్లీ! భరత భూమిని సముద్ధరింపుము. అమ్మా! ఈ నా బిడ్డ వీరాగ్రేసరుఁడై - సాధుజన విధేయుఁడై - పవిత్రాశయుఁడై - మహోదారుఁడై - దివ్య తేజస్వియై - స్వతంత్ర సామ్రాజ్యాధినేతయై వర్ధిల్లు నట్లనుగ్రహింపుము. భవానీ! నీ పాదపద్మములపై నున్న యీ కుంకుమమే నా బిడ్డని లలాటమున దీక్షా తిలక మగుగాఁక."

ఇట్లు ప్రార్థించి పూజా కుంకుమము తీసి కనుల కద్దికొని, తాను ధరించి, కుమారుని మోమునఁ బెట్టెను. శివుఁడు తామరమొగ్గవంటి యంజలిని ఫాలమునఁ గీలించి భవానికి వందన మాచరించెను. ఆ బాలుని లేఁత మనస్సులో లేచిన భావ తరంగము లెట్టివో యెవరు చెప్పఁగలరు?

'శ్రీరామచంద్రుఁడు మాయా కురంగముచే వంచింపఁబడక యాశ్రమమందే యున్నచో నా దుష్ట రావణుని జీవములతోఁ బోనిచ్చునా? అమ్మా!'

'అందులకే రావణుఁడు మారీచునిఁ గపట మృగాకృతిగా ముందంపెను. నీచులకు వంచనములే ప్రధాన సాధనములు గదా నాయనా!'

'శ్రీరాముఁడు రావణునకుఁ జేసిన ద్రోహ మిసుమంతయైనను లేదే!'

'అక్కఱ లేదు బాబూ! సహజముగా దుర్జనులు సజ్జనులకు నిర్హేతుక శత్రువులు.'

'శ్రీరాముఁడు భగవంతుఁడే గదా అమ్మా!'

'అవును. దుష్ట శిక్షణ-శిష్టరక్షణార్థము భగవానుఁడప్పు డప్పుడు భువి నవతరించును. రామ కృష్ణాదు లట్టివారే. శ్రీరాముఁడు పదునాలుగు వేల రక్కసుల యుక్కడఁగించి ధర్మరక్షణము గావించెను. కృష్ణుఁడు భారత యుద్ధము నడపించి ధర్మసముద్ధరణ మొనరించెను. ధర్మచ్యుతిని భగవంతుఁడు సహింపఁడు. కావుననే ఆయన కీ యవతారముల ప్రసక్తి.'

పై విధముగా మాతాపుత్రులకు సంభాషణ సాగి పోవుచుండెను. దాదవ్వలనుండి యెవరో వచ్చుచున్నట్లు పొడఁగట్టి జీజాబాయి లేచి నిలువఁబడెను.

వచ్చుచున్న వ్యక్తి మఱెవ్వరో గాదు; గురుదేవుఁడగు 'దాదాజీ'యే.

వారుభయులు గురుదేవునకు సాష్టాంగ నమస్కారమొనర్చిరి.

'దాదాజీ' వారిని దీవించెను.

ముప్పురును ముఖమంటపమునం దుపవిష్టులైరి.

అంత జీజాబాయి 'దాదాజీ! మీరు పరమపూజ్యులు. ధర్మస్వరూపులు. నా బిడ్డని ధనుర్విద్యాది సర్వశాస్త్ర పారంగతు నొనర్చి నా కోర్కెను దీర్పుఁడు. వీనిని ధర్మవీరునిగా సరిదిద్దు భారము సర్వము మీదియే. తమపైఁ బెద్ద యాశఁ బెట్టుకొంటి'నని యశ్రుపూరిత వయనమై వేడుకొనెను.

దాదాజీ ప్రసన్న వీక్షణముల శివునిపైఁ బఱపి—"అమ్మా! వీని భవిష్యత్తు మహోజ్జ్వలము. నాఁడు గరుడుఁడు మాతృదాస్యము రూపుమాపినట్లే నేఁడు నీ వాఁడు యావద్భారతదేశము నలముకొన్న దాస్యాంధకారమునుఁ బటాపంచలు చేసి 'స్వతంత్రమహారాష్ట్రము'ను స్థాపించును. ఇది భవానీదేవి యాదేశము-ఆశీర్వాదము. నా కర్తవ్యమును మరువను. వీఁడచిరకాలములో నా శిక్షణనంది వీరాధివీరుఁడగును: నీవు 'వీరమాత' వగుదువు. మహారాష్ట్రుల ధన్యముతోఁ బాటు దుండగుల పాపము ఫలించును. అందులకే 'శివుఁడు' ఉదయించినాఁ"డని పలికెను.

ఇంతసేపు శివాజీ దృష్టులు మధుపములై గురుదేవుని వదనకమలము నుండి మఱలనే లేదు. శివాజీ తనముందుం జూచుచున్నది దాదాజీగాదు—'పరమశివుని' ఇప్పటినుండి దాదాజీ విశ్వామిత్రుఁడు—శివాజీ శ్రీరామచంద్రుఁడు; దాదాజీ పరమేశ్వరుఁడు - శివాజీ పరశురాముఁడు.

# 3

అది బిజాపురపు సుల్తాను కొలువుకూటము. సింహాసనాసీనుఁడగు ఆదిల్ షాహి నవాబు మొగ మేలకో జేవురించెను. ఆతని చూడ్కులు సెగల పొగల నెగయించుచుండెను. వీరులు - రాజకీయోద్యోగులు తమ తమ యాసనముల గిక్కురుమనక గూర్చుండి యుండిరి.

సుల్తాను మేఘగర్జనవంటి స్వరముతోఁ "గోటితోఁ ద్రుంచివేయగల దానికి గొడ్డళ్ల యవసరము వచ్చినది. మన శహాజీకుమారుఁ డెంతవాఁడైనాఁడు. అపారసేనా వాహినితో విజృంభించి మన భూభాగమును గ్రమక్రమముగ నాక్రమించి బలవత్తరములగు దుర్గముల నిర్మించి 'స్వతంత్ర మహారాష్ట్రము'ను స్థాపించు దీక్షతో నిరంతరము కృషి సాగించుచున్నాఁడు. శహాజీపైఁ గల ప్రేమ పక్షపాతముచే మన మూరకొన్న కొలఁది వారి యాగడము మితిమీఱుచున్నది. ఆలస్యముచే నమృతము విషమగును. మన రాజ్యమునకే భంగము వాటిల్లునేమో! ఇందుకు మీ సలహాయే" మనెను.

అంత నొక సరదారు లేచి యిట్లనెను. 'ఖుదావంద్! తోరణగఢము జయించిన నాఁటినుండి శివాజీకిఁ బట్టపగ్గములు లేకున్నవి. అతని దండునకుఁ గొండలు, అడవులు కొట్టిన పిండి. మన కా పర్వతప్రాంతములు క్రొత్తలు. కాన వానిఁ జయించుట తేలిక పనిగాదు.

మఱియొకఁడు:—శహాజీని బంధించి మనము వేసిన యెత్తు పనిఁజేయలేదు. అతఁడు మనకు లొంగిరాఁడు. సరి గదా; సమాధానము గూడ పంపలేదు.

వేఱొకఁడు:—ప్రభూ! శహాజీనిఁ జంపివేసిన?

ఇంకొకఁడు:-ఖుదావంద్! అది చాలా ప్రమాదము. అది జరిగినవెంటనే వాఁడు క్రోల్పులివలె మనపైఁబడును.

అని తల కొకటిగా విన్నవించిరి.

అంత 'అబ్దుల్ శాహి' కోపముతో ఏమి! ఒక కొండ యెలుకనుఁ బట్టి తెచ్చు వీరు లిట లేనేలేరా? నామోష్! అందఱు పుస్తీలు పెంచుకొన్నవారే! జబ్బలు మెలిదిరిగిన జట్టీలే' అని కఠినముగ నొవ్వనాఁడెను.

కొలువులోని వారొకరిమొగ మొకరు చూచుకొన సాగిరి. కొందఱు నేలచూపులు చూచిరి. మఱికొందఱు తమ్మొ గాదన్నట్లు పైకప్పు దూలము లెక్కించిరి.

సభలోనివారి చూపులన్నియు నొకసారిగాఁ బరువెత్తి, నిజాసనము జేరుచున్న నొకవీరునకు స్వాగతమిచ్చినవి.

అతఁడు స్వామిభక్తిపరాయణుఁడు. - ఉన్నత పదవీ వ్యామోహితుఁడు - మతాభిమాన ధనుఁడు - తంత్రోపాయ కుశలుఁడు - దురంహంకారుఁడు నగు 'అఫ్జుల్ ఖాను.'

అఫ్జుల్ ఖాను గంభీరముద్ర నభినయించుచు, మెల్ల మెల్లగ 'తఖ్తు' వద్దకు నడచివచ్చి నేలకు వంగి సలాముచేసి 'జహాపనా! వీఁడు నమ్మినబంటుగదా! పనిఁగొనుఁ' డనెను.

ఆదిల్ శాహి విప్పారిన మోముతో 'సెహబాస్! యోధాగ్రేసరా! నీ వొక్కఁడవే యందులకు సమర్థుఁడవు. నీవు బెబ్బులివి; అతఁడు జింక; జయము నీదే. శివాజీ రేపు మన వంటయింటి కుందేలు. సేనాసమేతుఁడవై రేపే కదలుము. ఇదిగో ఖడ్గ' మనెను.

అఫ్జుల్ ఖాను 'మహాప్రసాద'మని కృపాణము గైకొని తుదిసలాము పెట్టెను.

సభలోని వారందఱు ఆదిల్ శాహికి - అఫ్జుల్ ఖానునకు జయవెట్టిరి. సభాభవనము దద్దరిల్లెను.

ఆ మహాజయ శబ్దములలో 'అమ్మయ్య! వీని పీడ మనకు నేఁటితో విడుగర - మనకేగాదు లోకమునకుఁగూడ - బత్తెములేదు కాబోలు - కావుననే ముందునకు వచ్చినాఁడు - బుద్ధిః కర్మానుసారిణీ - ఇఁకనైన మనము హాయిగా బ్రతుకఁ గలము-' అను వాక్యములు సన్నసన్నగాఁ గలియకపోలేదు.

నవాబు కొలువు చాలించెను.

'బ్రతుకుజీవుఁడా' యని యెవరిదారిని వారు వెడలి పోయిరి. కాని కార్యభార కారణమగు గుండెబరువుతో-

దీర్ఘాలోచనాయత్తచిత్తముతో - నేలచూపులతో - మంద
గమనముతో నడుఁగులు లెక్కించుకొనుచు అఫ్జుల్ ఖాను
నిజనివాసము చేరుకొనెను.

౪

అది మంత్రాలోచన మందిరము. అందు దీర్ఘ
మోచనా పరవశుఁడై 'శివాజీ' కూర్చుండి యుండెను.

ఇంతలో నొక మహారాష్ట్ర సేనాపతి తన వెంట నొక
పచ్చల పల్లకీతో వచ్చి బహిర్ద్వారమున నిలిచి ముకుళిత
కరుఁడై శివాజీ వైపు చూచెను.

శివాజీ—ఏమి? సేనానీ! ఈ పల్లకి నిటేలఁ గొనివచ్చితివి?
ఇందెవ రున్నారు?

సేనాపతి—ఇది తమ కుపాయనము. ఈమె కొంకణ దేశపు
సుబేదారు 'మౌలానా అహమ్మదు' గారి కోడలు.
యుద్ధములో మన చేజిక్కినది.

శివాజీ—నీవు శివాజీ సేనాపతి వేనా? మూర్ఖుఁడా! భవానీ
సాక్షిగఁ గైకొన్న శపథములనే గంగపాలొనర్చితివి?
పరస్త్రీలను గౌరవింప వలసిన పద్ధతు లెరుగవా?
సేనాపతి సిగ్గుచేఁ దలవంచుకొనెను.

తరువాత శివాజీ పల్లకీని సమీపించి 'సోదరీ' మా సేనా
తి నీయం దపరాధ మొనర్చినాఁడు. క్షమింపుము. నీ భర్తృ
గృహమునకు నిన్ను సురక్షితముగఁ జేర్చు భారము నాది.
ర్వము సిద్ధము గావింతును. భయపడకుమని యామెను

బంపివేసెను. మరల శివాజీ హృదయ మాలోచనాయత్త
మయ్యెను.

అఫ్జుల్ ఖాను మదాంధుఁడు - కపటి - అదిల్ శాహి
కుడిభుజము. వచ్చినవాఁడు యుద్ధసన్నాహ మొనర్పక సంధి
నడపుట కేమి కారణమొ? మంతనములాఁడ నేకాంత
సమావేశ మఁట! కానిమ్ము. వాని యంతు తేల్చుకొన
వలసినదే. "శఠే శాఠ్యం సమాచరేత్"—అని వితర్కించు
కొని శివాజీ వెంటనే కవచ, శిరస్త్రాణముల ధరించి, పైకి
గనబడకుండఁ దగిన దుస్తులు నలంకరించుకొని, కత్తి నొక
దానిని గుప్తముగ మొలలోఁ జెక్కి, పులిగోళ్లను వ్రేళ్ల కమ
ర్చుకొని యంత లంతలఁ బొంచియుండ సైనికుల కాజ్ఞ నిడి
భవానీ దేవిని యథావిధిఁ బూజించి తల్లి దీవెన నందుకొని
రహస్య సమావేశ మందిరమున కేఁగెను.

నిర్ణీత సమయమునకు ముందే 'అఫ్జుల్ ఖా' నఁటకు
వచ్చి జయము తనదిగా భావించుకొనుచు నటు నిటు పచారు
సేయుచుండెను.

కపటాభినయమున నొకరిని మించినవా రొకరు.

శివాజీనిఁ జూడఁగనే 'ఖాను' సంతోషాతిశయము
నభినయించుచు నెదురుగా వచ్చి 'భాయి! శివాజీ!' అని
కౌగిలించుకొను నటులు నటించి కత్తిని శివాజీ డొక్కలోఁ
గ్రుచ్చ యత్నించెను.

వెంటనే శివాజీ "సోదరా! నీ వింతవాఁడవయితివా?"
యని పులిగోళ్లతో ఖానునిఁ జంపి తన దుర్గమునకుఁ దాను
చేరుకొనెను.

రహస్యముగా నటనట నుంచఁబడిన మహారాష్ట్ర వీరులు హఠాత్తుగ శత్రుయోధులపైఁ బడి నురుమాడిరి.

మృత్యుముఖమునఁబడక మిగిలిన కొలఁదిమంది సైనికులు బిజాపురము చేరకముందే 'శివాజీ విజయ వృత్తాంతము' ఆదిల్‌శాహి కనులముందుఁ దళుక్కున మెఱసెను. అతని కనులు మూతవడెను. ఆ పిడుగు తనపై నెప్పుడు పడునోయని యాతనిగుండె గుబుక్కుమనెను.

*

ఢిల్లీ నగరమునందలి 'దర్బారు' లో 'ఔరంగజీబ్' సింహాసనాసీనుఁడై యుండెను. సరదారులు - సామంత భూకాంతులు - రాజకీయోద్యోగులు తమ తమ యాసనముల నధివసించి యుండిరి.

అంత నౌరంగజీబు "మొగలుసామ్రాజ్యనౌక యెట్టి తుపానుదెబ్బలకు లోనుగాక కాలప్రవాహమున సుఖప్రయాణము చేయుచు వచ్చినది. కాని కొలదికాలముక్రింద తుపాను చెలరేగినది. "శివాజీ" దక్షిణ భారతమందలి మహమ్మదీయ రాజ్యములఁ గొల్లగొట్టుకొనుచు నజేయుఁడై బలీయములగు దుర్గముల నాక్రమించుకొని 'మహారాష్ట్ర రాజ్యము'ను స్థాపించినాఁడు. మన సామ్రాజ్యమునుగూడ కబళింప నసంఖ్యాక బలముల నాయత్తపఱచుకొను చున్నాఁడు. అతనికిఁ దగిన శాస్తిగావించుటకు మేము 'శయిస్తఖాను' నంపుటయు - నాతఁడు తెగవ్రేయఁబడిన చేతివ్రేళ్లతో చావుదప్పి

కన్ను లొట్టబోయి బలాయితుఁడై వచ్చుటయు—తరువాత 'జయసింహుఁడు' మన సేనలు దరలించుకొని పోయి వాని నెదిరించి నిలువనేరక యసువులఁ దక్కించుకొని వచ్చిన సంగతి మీ రెఱిఁగియే యున్నారు. మన ప్రయత్నములు రెండును వమ్మయ్యెను. ఆ 'కొండమెలుక' రాజగడము కోటకొమ్మల కెక్కినదఁట! వానియెడ దండముకన్న సామ-దానములే ప్రయోగింప సాధ్యములేమో! 'పురందరు'లో జరిపిన సంధినియమముల కాత డంగీకరించినట్లు తెలియవచ్చి నది. నేఁడో - రేపో మనతోడి మైత్రిఁ బెంపొందించుకొన నాతఁడే యిట కేతెంచును—ఇందులకు మీ రేమందు"రని ముసిముసి నగవుల దోఁపఁ బలికెను.

సభాసదులు 'చిత్తము - చిత్తము' తమ శక్తి యద్వితీయ' మనిరి.

మఱునాఁటి మొగలు దర్బారునకు శివాజీ విచ్చేసెను; కాని యాతనికి సంధినియమప్రకారము గాఁక 'పంచహజారీ స్థానము'న నొక యాసనము ప్రత్యేకింపఁబడెను. దానితో 'ఛత్రపతి' దండ తాడిత భుజంగమై కాలమునకుఁ గట్టుఁబడి తన యాసనమునందే యుండెను.

అంతఁ బాదుషా నిరాదరణ సూచకముగ 'రాజా! శివాజీ! నీ రాక మాకు సంతోషము గలిగించిన' దనెను.

శివాజీ! 'జహాపనా!' అని యేమో పలుకఁబోయి కోపావేశము నాపుకొనలేక స్మృతిఁ దప్పి యాసనమందే యొరిగెను.

అంత బాదుషా 'రాజా శివాజీకి శరీర స్వాస్థ్యము సరిగ లేనట్లున్నది; కావున నీతనిని మన 'రాజమహాలు'నకుఁ జేర్చి తగిన చికిత్స చేయింపుఁడని సరదారుల కానతి పెట్టెను.

తోడనే పాదుషావారి యాజ్ఞ నిర్వర్తింపఁబడెను.

౬

ఆ రాజమహాలొక కత్తులబోను. శివాజీ యందుఁ జిక్కుపడిన మహోగ్ర సింహము.

వైద్య సహాయమునకుఁ గొదువ లేదు. సదుపాయము లకుఁ దఱుఁగు లేదు; కాని గౌరవ ప్రతిష్ఠలు మంటఁ గలిసిన వని భావికార్యక్రమమున కంతరాయము గలిగినదని తీరని బాధచే శివాజీ యొకప్పుడు కుమిలిపోవును. పాదుషా వంచన తలంచి దంత ఘట్టన మొనర్చును. సుల్తాను దుష్ట గర్వమునకుఁ గష్టపడును. ఆతఁడు తన్నవమానించినందు లకుఁ గన్నుల విస్ఫులింగములు రాల్చును. తా నట బంధింపఁ బడుటకు గటకటం పడును. ఇది మన శివాజీ 'దినచర్య'.

ఒకనాఁ డకస్మాత్తుగా నాతని మనస్సులో నొకయుపా యము స్ఫురించెను.

తోడనే యాతఁడు రక్షకభటు నొకనిఁ బిలిచి 'రేపు మా జన్మదినము. ఆ సందర్భమున మిఠాయీలు, పండ్లు విరివిగ బంచుటకు సంకల్పించినాము. దీనిని మీ యధికారి కెఱిగింపు' మని చెప్పి తన రహస్య పలాయన విధానమును

విశ్వాసపాత్రులగు సేవకులచేఁ ఢిల్లీ పట్టణమునందు తనకై వేచియున్న మహారాష్ట్ర వీరులకుఁ దెలియఁ జేసెను.

మఱునాఁడు శివాజీ జన్మదినోత్సవము 'వైభవోపేత ముగ జరిగిపోయెను. కావలియున్న భటుల కంట దుమ్ముఁ గొట్టి 'మహారాష్ట్ర సింహము' పండ్ల గంపలలో దూరి 'రాయగఢము'నకుఁ జేరెను.

కావలివారి ప్రాణము లెగిరిపోయెను.

పాదుషావారి గుండె జారిపోయెను.

నగరములోఁ గలకలము సైనికులలో సంచలనము మెండయ్యెను.

శివాజీనిఁ బట్టి తెప్పించు పాదుషా ప్రయత్నము 'గత జల సేతు బంధనము' గాఁక మఱేమగును?

## ౭

శివాజీ 'రాయగడము' చేరెను. మొగలు చక్రవర్తి తనపై నెత్తివచ్చుట తప్పదని నిశ్చయించి శివాజీ యొక ప్రక్క దుర్గములఁ గట్టిపఱచుకొను చుండెను. మఱియొక వైపు సైనికుల సన్నద్ధపఱచుకొను చుండెను. వేఱొక దిక్కున 'సింహగడ మహాదుర్గము'ను సత్వరముగఁ దమ హస్తగత మొనర్చుటకు సర్వప్రయత్నములఁ జురుకుగ సాగించుచుండెను. ఛత్రపతి పిలుపునకు మహాప్రదేశము నలు మూలలనుండి స్వాతంత్ర్య సమర యోధులు 'మేము మే'మని ముందునకు దుమికిరి. తానాజీ-సూర్యాజీ మున్నగువారు

చక్రవర్తికిఁ జేదోడు వాదోడుగా నిలఁబడి సైనికుల నడపించిరి.

తానాజీ 'సింహగఢము'ను జయించుటకు సాహసించెను. అందులకు శివాజీ సమ్మతించెను.

సూర్యాజీ—బాలాజీ—మున్నగువారు తానాజీని వెన్నంటిరి.

'సింహగఢము' ఒక పర్వత శిఖరముపై నున్న మహాదుర్గము. దానిచుట్టు ఎత్తగు 'రాతికోట' గలదు. బయట నున్నవారికి దాని సింహద్వారము తప్ప మరేమియు గోచరింపదు.

ఒకనాఁటి చీకటిరేయిలో మహారాష్ట్ర సైన్యములు రహస్యమార్గమునఁ బోయి దుర్గప్రాకారమును సమీపించెను.

మహారాష్ట్ర భటుఁ డొకఁడు ప్రాణములకుఁ దెగించి కోటగోడ కెగఁబ్రాకి త్రాటి నొకదానినిఁ గ్రిందకు వదిలెను. దాని యాధారమున మూఁడువందలమంది వీరభటులు—తానాజీ మున్నగువారు కోటలోఁ బ్రవేశించిరి.

యవనసైనికులు, మహారాష్ట్రసైనికులకు సంకుల సమరము సాగెను.

స్థానబలము - సంఖ్యాబలముగల శత్రుధాటికి మహారాష్ట్రవీరు లాగఁజాలకపోయిరి.

దురదృష్టమున నప్రతిమాన ప్రతాపుఁడగు 'తానాజీ'

తోడనే మహారాష్ట్రవీరులు చిందరవందర కాఁ జొచ్చిరి.

అంతఁ దానాజీ సోదరుఁడును వీరశిరోమణియు నగు 'సూర్యాజీ' ముందునకువచ్చి సైనికులలో రణోత్సాహమును బురిఁగొల్పెను.

మహారాష్ట్రవీరులు సూర్యాజీ యందఁ జూచుకొని విజృంభించి ముహూర్త మాత్రములో యవనబలములఁ దఱుమఁగొట్టి 'సింహగఢము' నాక్రమించుకొనిరి.

'సింహగఢము' చేఁజిక్కినది; కాని 'సింహము' కూలి పోయినది.

సువిశాల భూభాగము మహారాష్ట్రుల పరిపాలన లోనికి వచ్చెను.

ఢిల్లీపాదుషా యంతటివాఁడు తలదిరిగి వచ్చి సంధి బేరమునకు దిగెను.

బీజపుర సుల్తానులు 'భాయి—భాయి'గ మెలఁగ నారంభించిరి.

శివాజీ శత్రుదుర్నిరీక్షుఁడై రవిసంకాశ తేజముతో వెలుఁగొందెను.

౧౮

అది యొక శుభముహూర్తము. 'రాయగఢము'న మంగళవాద్యములు మ్రోఁగుచుండెను. విప్రపుంగవులు సామ గాన మొనర్చుచుండిరి.

అట్టితఱి 'శివాజీ' గురుదేవుడగు సమర్థరామదాసుని భవానీదేవి యనుగ్రహముతోను - మాతృమూర్తి శుభాకాంక్షలతోను - ప్రజల యుత్సాహాతిశయముతోను 'భారత సామ్రాజ్యపట్టము' గట్టుకొనెను.

ఆనాటి 'పట్టాభిషేక మహోత్సవము'నకు సామంతులు, దండనాథులు - మిత్రరాజ్య ప్రతినిధులు విచ్చేసిరి.

శివాజీ అందరను సముచితరీతుల గౌరవించెను. ఆ మహారాజు పరిపాలనములో భారత మాదర్శభారతమై వెలుగొందెను. నాటినుండియే స్వతంత్ర మహారాష్ట్రమునకు స్వర్ణయు[illegible]మయ్యెను.

